బాలానంద బొమ్మల

# డాన్ క్విక్సోట్ సాహస యాత్రలు



స్వేచ్ఛానుసరణ

సింగంపల్లి అప్పారావు



నవరత్న బుక్ హౌస్

కారల్‌మార్క్సురోడ్, విజయవాడ-520002.

# బాలానంద బొమ్మల డాన్ క్విక్సోట్ సాహస యాత్రలు

ర చ న :
**సింగంపల్లి అప్పారావు**

ప్రథమ ముద్రణ :
**నవంబర్ 2000**



ముఖచిత్రం :
**రవి**

లోపలి బొమ్మలు :
**వి.యస్. ప్రకాష్**


**బి. కె. ఆర్. మూర్తి (పబ్లిషర్)**
28-22-20, రహిమాన్ వీధి
అరండల్ పేట, విజయవాడ-2
ఫోన్ : 432 813

ముద్రణ :
**డి. బి. ప్రింటర్స్**
విజయవాడ-2

వెల : రు. 25-00

## బాలసాహిత్యంలో - బంగారు మొలకలు

బాలానంద బొమ్మల షిరిడీ సాయిబాబా
" అరేబియన్ నైట్స్ అద్భుత కథలు (3 భాగాలు)
" షేక్స్‌పియర్ అద్భుత కథలు(3భాగాలు)
" బైబిల్ కథలు (2 భాగాలు)
" సింద్‌బాద్ సాహస యాత్రలు
" రాబిన్‌సన్ క్రూసో సాహస యాత్రలు
" డాన్ క్విక్సోట్ సాహస యాత్రలు
" రాబిన్‌హుడ్ సాహస యాత్రలు
" రెండు మహానగరాల కథ
" డేవిడ్ కాపర్ ఫీల్డ్
" ఆలివర్ ట్విస్ట్
" రాజు - పేద
" ప్రపంచ అద్భుత కథలు
" పంచ తంత్రం (2 భాగాలు)
" రామాయణం
" భారతం
" భాగవతం
" దశావతారాలు
" శ్రీకృష్ణలీలలు
" టిప్పుసుల్తాన్
" వీరపాండ్య కట్టబ్రహ్మన

బొమ్మల మర్యాద రామన్న కథలు
" అల్లావుద్దీన్ అద్భుత దీపం
" ఆలీబాబా 40 దొంగలు
" అక్బర్ బీర్‌బల్ వినోద కథలు
" బేతాళ కథలు
" తెనాలి రామకృష్ణ కథలు
" పరమానందయ్య కథలు
" భట్టి-విక్రమాదిత్యుల కథలు(2భాగాలు)
" అపూర్వ చింతామణి
" కాశీ రామేశ్వర మజిలీల కథలు
" గలివర్ సాహస యాత్రలు
" భగత్‌సింగ్
" బి. ఆర్. అంబేద్కర్
" సుభాష్‌చంద్రబోస్
" అజాద్ చంద్రశేఖర్
" రాజా రామమోహనరాయ్
" మదర్ థెరిసా
" రవీంద్రనాథ్ ఠాగూర్
" జయప్రకాష్ నారాయణ్
" యోగి వేమన
" పూజ్య బాపూజీ
" భగవతీచరణ్

## విద్యార్థినీ విద్యార్థులకు అమూల్య నేస్తాలు

ఇంగ్లీష్-తెలుగు డిక్షనరి
తెలుగు-ఇంగ్లీష్ డిక్షనరి
హిందీ-తెలుగు డిక్షనరి
తెలుగు నిఘంటువు
త్రిభాషా డిక్షనరి
తెలుగు-హిందీ డిక్షనరి
ఇంగ్లీష్-ఇంగ్లీష్ డిక్షనరి
ఇంగ్లీష్-హిందీ డిక్షనరి
హిందీ-ఇంగ్లీష్ డిక్షనరి
రసాయన శాస్త్ర నిఘంటువు
జంతుశాస్త్ర నిఘంటువు
వృక్షశాస్త్ర నిఘంటువు
గణితశాస్త్ర నిఘంటువు
భౌతికశాస్త్ర నిఘంటువు
ఇంగ్లీష్ వ్యాసాలు-లేఖలు
హిందీ వ్యాసాలు-లేఖలు
తెలుగు వ్యాసాలు-లేఖలు
ఇంగ్లీష్ గ్రామర్
హిందీ గ్రామర్ (హైస్కూల్)
హిందీ గ్రామర్ (డిగ్రీ)
శౌప్లీ జోక్స్
త్రిభాషా వ్యాకరణం
ఎంకిపాటలు
హితవాహిని

తెలుగు వ్యాకరణము
సులభ వ్యాకరణము
45 రోజుల్లో ఇంగ్లీష్
45 రోజుల్లో హిందీ
ఇంగ్లీష్ తెలుగు స్వబోధిని
హిందీ తెలుగు స్వబోధిని
గణిత ఒలింపియాడ్ (తెలుగు)
గణిత ఒలింపియాడ్ (ఇంగ్లీష్)
గణిత సూత్రముల్లు
గణితము-సమస్యలు-సాధనలు
ప్రాథమిక గణిత శాస్త్ర స్వబోధిని
అంక గణితం
గణితశాస్త్రం (బీజగణితం)
స్మాల్ స్కేల్ ఇండస్ట్రీస్
ఫోటోగ్రఫీ నేర్చుకుందాం
తెలుగు సామెతలు
ఇంగ్లీష్ తెలుగు సామెతలు
మీ ఆంగ్ల పదజాలం పెంపొందించుకోండి
జోక్స్ వరల్డ్
1001 జోక్స్-జోక్స్-జోక్స్
1001 వింతలు-విచిత్రాలు
నవ్వులు
ఖగోళశాస్త్రం-క్విజ్
కార్టూన్లు

# 'డాన్ క్విక్సోట్' సాహస యాత్రలు!

నాలుగు వందల సంవత్సరాల క్రితం స్పెయిన్ దేశం దక్షిణ ప్రాంతాన 'లామాంషా' అనే జిల్లా ఉంది.

ఆ జిల్లాలోని ఓ కుగ్రామంలో 'క్విక్సోడా' అనే పేరుగల వ్యక్తి ఉండేవాడు.

క్విక్సోడా మధ్యవయస్కుడు. గౌరవప్రదమైన సాంప్రదాయ కుటుంబంలో పుట్టాడు. సన్నగా, పొడవుగా ఉండేవాడు. క్విక్సోడాకు చెడు అలవాట్లు ఏమీ లేవు. నిత్యం వ్యాయామం చేస్తూ ఉండేవాడు. అతడిది ఆరోగ్యవంతమైన శరీరం!

అతడు ధనవంతుడు కాకపోయినా ఏమీ లేనివాడు మాత్రం కాదు. కొద్దిపాటి భూ వసతి వుండేది. క్విక్సోడాకు యింకా వివాహం కాలేదు. ఇంట్లో అతని మేనకోడలు, ఓ ముసలి నౌకరు తప్ప వేరే ఎవరూ లేరు. ఇంటి పనులు వాళ్ళు చూస్తుండేవారు. పొలం పనులు జీతగాడొకడు చూస్తుండేవాడు.

క్విక్సోడా వద్ద ఓ కుక్క, దీనావస్థలో ఉన్న ఓ ముసలి గుర్రం వుండేవి. ముసలి గుర్రానికి క్విక్సోడా ముద్దుగా పెట్టిన పేరు 'రోజినాంటి'.... అతడికి ఆ గుర్రమంటే ఎంత మక్కువో చెప్పలేము. అయితే ఏం లాభం?....దానికి తగినంత ఆహారం మాత్రం పెట్టలేకపోయేవాడు. అందుకు అతడి ఆర్థిక పరిస్థితి అవరోధంగా ఏర్పడేది. అందువలన, అది బాగా బక్కచిక్కి ఎముకల గూడులా వుండేది.

"నా గుర్రం ప్రపంచంలోకెల్లా అందమైన గుర్రం! ఈ విశిష్టమైన గుర్రానికి యజమానినని చెప్పుకోవడం నాకెంతో గర్వకారణం!" అని గర్వంగా చెప్పుకునేవాడు క్విక్సోడా.

క్విక్సోడాకు చేయవలసిన దినచర్య అంటూ ఏదీ లేదు. చిన్నతనం నుండీ అతడికి పుస్తకాలు చదవడం అంటే ఎంతో యిష్టం. ఆ ఇంట్లో ఎన్నో పురాతన గ్రంథాలు వుండేవి. అందులో వీరాధివీరుల సాహస గాథలు, సాహస కృత్యాలు ఎక్కువగా వుండేవి. వాటిని చదువుతున్నంతసేపూ తనను ఓ మహావీరుడిగా వూహించుకుని, ఉప్పొంగిపోతూ వుండేవాడు. దానితో, తను కూడా ఓ మహావీరుడిగా పేరుప్రఖ్యాతులు తెచ్చుకోవాలనీ, తన పేరు కూడా చరిత్రలో స్థిరస్థాయిగా నిలిచిపోవాలనీ, రోజూ పగటికలలు కంటూ వుండేవాడు.

క్విక్సోడాకు ఇద్దరు బాల్యస్నేహితులు వున్నారు. ఒకడు ఆ ఊరి మతాధికారి! మరొకడు 'నికొలస్' అనే పేరుగల మంగలివాడు. క్విక్సోడా తన స్నేహితులతో మాట్లాడినంతసేపూ వీరాధివీరుల గురించీ, వాళ్ళు చేసిన సాహస కార్యాల గురించి తప్ప మరొక విషయం మాట్లాడేవాడు కాదు.

ఆ విధంగా కొంతకాలం గడిచేసరికి 'తాను కూడా మహాయోధుడు' అనిపించుకోవాలన్న కాంక్ష క్విక్సోడా మనసులో గాఢంగా నాటుకుపోయింది.

ఒకరోజున అతడు ఇల్లంతా గాలించాడు. మూలనున్న పెద్ద పెట్టెలో, ఇనుప కవచం ఒకటి దొరికింది. క్విక్సోడా ఎంతో సంబరపడిపోతూ, ఒక రోజంతా కూర్చుని దానిని తోముతూ మెరుగు పెట్టాడు.

అతడి వద్ద చాలా సంవత్సరాలుగా ఒక శిరస్త్రాణం వుంది. అది ఉక్కుతో తయారు చేయబడింది. కానీ అక్కడక్కడ చిన్న చిన్న ముక్కలు విరిగిపోయి వుంది. క్విక్సోడా దానికి గూడ మెరుగులుపెట్టి, విరిగినచోట రేకుముక్కలు అతికించి, శిరస్త్రాణాన్ని సిద్ధం చేసుకున్నాడు.

ఇకపోతే మహా వీరుడికి ఆయుధాలు వుండాలికదా! తుప్పు పట్టిన ఓ ఖడ్గాన్నీ పొడవాటి బల్లేన్నీ కూడా సంపాదించగలిగాడు.

యోధుడికి తగిన గుర్రం అతడివద్ద వుండనే వుంది. ఇక మిగిలినదల్లా యోధుడికి తగిన పేరు. తన పేరు క్విక్సోడాకు నచ్చలేదు. క్విక్సోడా పేరును, డాన్ క్విక్సోట్ గా మార్చుకున్నాడు.

మహాయోధుడికి వుండవలసిన శిరస్త్రాణం కవచం, డాలు, కత్తి, బల్లెం, గుర్రం అన్నీ డాన్ క్విక్సోట్ కు సమకూరాయి.

కానీ ఒక్కటే లోపం.... అదేమంటే చరిత్రలోని ప్రతి యోధుడికీ తప్పకుండా ఓ ప్రియురాలు వుంటుంది. మరితనకు గూడ ఓ ప్రియురాలు ఉండాలి కదా!....ఆమె సామాన్య వనిత కాకూడదు. మహారాణిగా ఉండాలి. ఆమె నామస్మరణ ఆమె ప్రేమ తనకు ఉత్తేజాన్నీ ప్రేరణనూ కలిగించాలి.

'అయితే తన హృదయరాణిగా ఎవరిని ఎన్నుకోవాలి?'

అతడు అంతవరకు ఏ స్త్రీని గాఢంగా ప్రేమించలేదు. ఏ యువతి మాత్రం అతడ్ని ఎలా ప్రేమిస్తుంది? .... ప్రేయసి విషయమై డాన్ క్విక్సోట్ దీర్ఘంగా

ఆలోచించాడు.

అతడికి కొన్ని సంవత్సరాల క్రిందటి సంగతి ఒకటి జ్ఞాపకం వచ్చింది—

అతడు నివసిస్తున్న గ్రామానికి కొద్ది దూరంలో 'టొంబోసా' అనే గ్రామం వుంది. ఆ గ్రామంలో సామాన్య రైతు కుటుంబానికి చెందిన లావుపాటి అమ్మాయి ఒకతె ఉండేది. ఆమె అందగత్తె అని చెప్పిన వారు ఎవ్వరూలేరు. ఆమెను క్విక్సోడా ఒకసారి చూడటం తటస్థించింది. ఆమె అతడికి నచ్చింది. పేరు అడిగి తెలుసుకొన్నాడు ఆ తర్వాత ఆమెను మరచిపోయాడు.

మళ్ళీ ఇప్పటికి ఆమె డాన్‌క్విక్సోట్ మనసులో ప్రత్యక్షమైంది.

'ఆమె పేరు' ఆల్డోంజాలారెంజో' కదూ!....అవును! ఆ అమ్మాయే నా హృదయరాణి! ఆమె కోసం ఆమె రక్షణ కోసం ఆమె సేవలకోసం నా జీవితాన్ని వినియోగిస్తాను. నా ప్రాణాలనే త్యాగం చేస్తాను.' అనుకున్నాడు డాన్‌క్విక్సోట్.

'అన్నిటితోబాటు నా హృదయరాణి పేరును కూడా మార్చేయాలి. ఏం పేరు పెట్టాలి? ఆс....ఆమెకు డల్సీనియా అని నామకరణం చేస్తాను. ఓ నా హృదయాధి దేవతా! అతిలోక సౌందర్యరాశీ డల్సీనియా!....నేను సాహస యాత్రలకు బయలుదేరుతున్నాను. ఎన్నో స్వైర విహారాలు చేసిన పిమ్మట నీ దర్శనం చేసుకుంటాను దేవీ!' అంటూ ఉప్పొంగిపోయాడు.

## 2

ఓ శుభముహూర్తాన డాన్‌క్విక్సోట్, శిరస్త్రాణం, కవచం, ధరించాడు. కత్తి, బల్లెం, డాలు తీసుకొని, ముద్దుల గుర్రాన్ని అధిరోహించాడు. ఆ తర్వాత సాహస కృత్యాలు చేసి పేరు ప్రఖ్యాతులు సంపాదించడానికి గ్రామం వదిలి విశాల ప్రపంచంలోనికి ప్రయాణం సాగించాడు.

అతడు గ్రామం వదిలి చాలా దూరం వచ్చిన తర్వాత గాని ఓ విషయం గుర్తుకు రాలేదు.

అదేమంటే....మహా యోధుడు అనిపించుకొనేవాడు. మొదట ఇంట గెలిచి రచ్చ గెలవాలి!....ఇంట అంటే తన గ్రామంలో తను యుద్ధం చేసి గెలువడానికి యోధుడనేవాడు ఎవ్వడూ లేడు, కనీసం తను మహాయోధుడు అనిపించుకోకుండా సాహసకార్యాలు చేసేందుకు బయలుదేరడం ఏమంత సబబు!....ఎలాగైనా సరే ఎవరో ఒకరితో నువ్వు మహావీరుడవు! అనిపించుకోవాలి. అంతవరకు తనకు మనశ్శాంతి వుండదు అనుకున్నాడు.

డాన్‌క్విక్సోట్ ముసలి గుర్రం అలా నడుస్తూ ముందుకు పోతూనే వుంది. అతడికి శత్రువులంటూ ఎవరూ లేరు. గమ్యస్థానమనేది అసలే లేదు. గుర్రం ఎటు తీసుకువెళితే అటుపోవడం ప్రారంభించాడు.

ఉదయాన్నే తన గ్రామంలో గుర్రాన్ని అధిరోహించిన ఆ మహాయోధుడు సాయంకాలం సూర్యుడు పశ్చిమ దిశకు చేరుకునే వరకూ గుర్రాన్ని దిగలేదు. సూర్యతాపాన్ని తట్టుకున్నాడు. ఆకలి దహించి వేస్తున్నా భరించాడు. దాహాన్ని లెక్క చేయలేదు. బక్కచిక్కిన ముసలి గుర్రానికి గూడ ఆ అవస్థ తప్పలేదు.

'మహాయోధుడికి ఆకలిదప్పులు, విశ్రాంతి కన్నా పట్టుదల, దీక్ష, ఓర్పు, సహనం, త్యాగశీలత ముఖ్యం' అన్నది డాన్‌క్విక్సోట్ సిద్ధాంతం!–

సిద్ధాంతానికి గూడ ఓ హద్దు అంటూ ఉంటుంది కదా సాయంకాల మయ్యే సరికి యోధాగ్రేసరుడు బాగా అలసిపోయాడు. గుర్రం నురగలు కక్కసాగింది. విశ్రాంతి తీసుకునేందుకు ఏదైనా కోట కనిపిస్తుందేమోనని క్విక్సోట్ అటుయిటు దృష్టి సారించి చూసాడు.

దూరంగా ఉన్న ఒక పూటకూళ్ళ ఇల్లు అతడికి కనిపించింది.

'భేష్! ఈ కోట నా వంటి మహాయోధులు విశ్రాంతి తీసుకునేందుకు తగినట్టుగానే ఉంది. నేను ఈ రాత్రికి ఇక్కడ కాలక్షేపం చేస్తాను.' అనుకున్న క్విక్సోట్ నెమ్మదిగా గుర్రంమీద పూటకూళ్ళ ఇంటికి చేరుకున్నాడు.

'మహాయోధుడనైన నేను వస్తున్న వార్త ఈ కోటకు చేరే ఉంటుంది. మరి నన్ను ఆహ్వానించడానికి ఏ ఉద్యోగి కూడా రాలేదేమి?' అనుకున్నాడు క్విక్సోట్.

అంతలో పందులను కాసే కాపరి ఒకడు తన పందులను తోలుకుంటూ అటుగా వచ్చాడు. అతడు పందులను ఒకచోట చేర్చడానికి వీలుగా తన దగ్గరున్న కొమ్ముబూరా నొకదానిని బిగ్గరగా ఊదాడు.

'అయితే నేను వస్తున్న విషయం కోటలోని వారికి తెలిసిందన్న మాట!.... మరి నన్ను ఆహ్వానించేందుకు లలనా మణులు రావాలి కదా! ఇంకారాలేదేమిటి?' అనుకున్నాడు.

అదే సమయంలో పూటకూళ్ళ ఇంట పనిచేస్తున్న ఇద్దరు స్త్రీలు యివతలికి వచ్చారు. వస్తూనేవాళ్ళు, ఎదురుగా గుర్రం మీద కూర్చుని తమవంకే చూస్తున్న మహాయోధుడ్ని చూసారు. అతడి ఆకారం వేషం చూసి వాళ్ళు భయపడి తిరిగి లోపలికి వెళ్ళబోయారు.

"ఆగండి కులీనవంశ సంజాతులారా! స్వాగత సత్కారాలు చేయకుండానే తిరోగమిస్తున్నారేమి?" అన్నాడు.

ఆ యువతులిద్దరూ భయంతో లోనికి పరిగెత్తుకుంటూ వెళ్ళి, ఈ విషయాన్ని తమ యజమానితో చెప్పారు.

ఆ పూటకూళ్ళ ఇంటి యజమాని ఆదరాబాదరా యివతలికి వచ్చాడు. అతడు పొట్టిగా గుండ్రని బంతిలా ఉంటాడు. బాగా కొవ్వు పట్టిన శరీరంతో చూసే వారికి నవ్వు వచ్చేటట్టు కనిపిస్తాడు.

అతడు డాన్‌క్విక్సోట్‌ని చూస్తూనే భయపడి "యోధాగ్రేసరా! స్వాగతం! సుస్వాగతం! మీరాక కొరకు మేము ఎంతో కాలంనుండీ ఎదురు చూస్తున్నాం. దయ చేయండి. ఆ ఉత్తమాశ్వంపై నుండి క్రిందికి దిగండి. మీ కోసం విలువైన భోజన పదార్థాలు ఎదురు చూస్తున్నాయి. దయ చేయండి!" అన్నాడు వినయ విధేయతలు ప్రదర్శిస్తూ.

పూటకూళ్ళ ఇంటి యజమాని లౌక్యం తెలిసినవాడు. ఎవరిని ఎలా ఆహ్వానించాలో అతడికి బాగా తెలుసు.

డాన్‌క్విక్సోట్ ఎంతో సంతోషిస్తూ గుర్రం దిగాడు.

"చూడండి గవర్నర్ మహాశయా! మీ కోట చాలా బాగుంది. మీ స్వాగతో

పన్యాసం, నన్ను మంత్ర ముగ్ధుణ్ని చేసింది. మీ కోటలో విశ్రాంతి తీసుకుంటాం. మీ ఆతిథ్యాన్ని స్వీకరిస్తాం. అదే మాకు ఆనందం. మీకు యివే మా కృతజ్ఞతాభి వందనాలు." అన్నాడు క్విక్సోట్ రాచఠీవి చూపిస్తూ.

"చూడండి గవర్నర్ మహాశయా! ప్రపంచంలోని అరుదైన ఉత్తమాశ్వాలలో మా ఈ అశ్వం ప్రథమ స్థానంలో వుంటుంది. దీని రక్షణ బాధ్యతను మీ భుజ స్కంధాలపై మోపుతున్నాము. తక్షణం ఈ అశ్వరాజాన్ని అశ్వశాలకు తరలించండి" అన్నాడు డాన్ క్విక్సోట్.

"చిత్తం! యోధాగ్రేసరా! నా కంటికి రెప్పలా మీ అశ్వాన్ని వేయి కళ్ళతో చూసుకుంటాను" అన్నాడు పూటకూళ్ళ ఇంటి యజమాని తనలో నవ్వుకుంటూ.

ఆ ఇద్దరు స్త్రీలు క్విక్సోట్ను తీసుకుని ఓ గదిలో అడుగు పెట్టారు. క్విక్సోట్ కవచాన్ని విప్పదీసాడు. శిరస్త్రాణాన్ని తీయబోయాడు. అయితే అది ఊడిరానని మొరాయించింది. ఆ ఇద్దరు స్త్రీలు అతడి శిరస్త్రాణం తీయడానికి విశ్వ ప్రయత్నం చేసారు. అయినా ప్రయోజనం లేకపోయింది.

"ఉన్నత వంశానికి చెందిన వనితలారా! నా విషయంలో మీరు తీసుకుంటున్న శ్రద్ధాసక్తులకు ఎంతో ఆనందిస్తున్నాను. ఉన్నత వంశ స్త్రీలకు సేవ చేసేందుకు ఈ మహాయోధుడు ఎప్పుడూ సిద్ధంగా ఉంటాడని గుర్తుంచుకోండి. మీ స్నేహితురాండ్రకు గూడ యీ విషయం తెలియజేయండి! మీకివే నా కృతజ్ఞతలు" అన్నాడు డాన్ క్విక్సోట్.

ఆ యువతులిద్దరూ ఒకరి మొఖాలొకరు చూసుకున్నారు. ఆ వ్యక్తి ఏం మాట్లాడుతున్నాడో వాళ్ళకు అర్థం కాలేదు.

"ప్రభూ! మీరు భోజనం చేస్తారా? పానీయం సేవిస్తారా? లేక విశ్రాంతి తీసుకుంటారా?" అని ఆ యువతులు డాన్ క్విక్సోట్ని అడిగారు.

"ఓ కులీన యువతులారా! నాకు విందు భోజనం కావాలి. మధురమైన పానీయాలు కావాలి. ఆ తర్వాత హంసతూలికా తల్పం ఏర్పాటుచేస్తే హాయిగా నిద్రిస్తాను. నా వంటి మహోన్నత వ్యక్తిని ఆ విధంగా సేవ చేసుకుంటే మీ జీవితాలు

ధన్యత చెందుతాయి. వెళ్ళి త్వరగా నేను కోరినవన్నీ తీసుకురండి!" అన్నాడు క్విక్సోట్.

వాళ్ళు వెళ్ళి నాలుగు ఎండు చేపలు నిల్వ ఉన్న బంగాళా దుంపకూర, రెండు ఎండు రొట్టెలు తీసుకొచ్చారు. వాటిని డాన్ క్విక్సోట్ విందు భోజనం మాదిరిగా ఎంతో ఆప్యాయంగా ఆరగించాడు. అతడు అంతకంటె ఎక్కువ భోజనం ఇంటి దగ్గర ఆరగిస్తే కదా!

శిరస్త్రాణం శిరస్సు నుండి ఊడి రాకపోవడంవల్ల క్విక్సోట్ భోజనం చేసేందుకు చాలా ఇబ్బందిపడ్డాడు. ఇద్దరు స్త్రీలు ఆ విషయంలో అతడికి ఎంతో సహాయం చేసారు. వాళ్ళు ఓ గొట్టం తెచ్చి దానిని అతడి నోటిలోనికి దూర్చి ద్రాక్ష సారాయాన్ని అతడిచేత తాగించారు.

విందు భోజనం అయిన తర్వాత యువతులు అతడికొక కుక్కి మంచాన్ని చూపించి "ప్రభువులు యీ హంసతూలికా తల్పంమీద విశ్రాంతి తీసుకోవచ్చు" అని చెప్పారు.

డాన్ క్విక్సోట్ మంచంమీద కూర్చున్నాడే కానీ అతడికి నిద్ర పట్టలేదు.

"ఎవరైనా సరే! నన్ను ఈ కోటలోనే మహాయోధుడుగా ప్రకటించాలి. లేకపోతే నాకు మనశ్శాంతి ఉండదు! అంతేకాదు, ముందుముందు సాహసకృత్యాలు చేయడానికి వీల్లేదు! కనుక నన్ను ఎవరు 'మహాయోధుడు'గా ప్రకటిస్తారు?" అని క్విక్సోట్ తెగ ఆలోచించాడు.

తక్షణం అతడి మస్తిష్కంలో ఓ దివ్యమైన ఆలోచన తళుక్కున మెరిసింది.

వెంటనే అతడు దిగ్గున మంచం మీది నుండి లేచాడు. తిన్నగా పూటకూళ్ళ యజమాని వద్దకు వెళ్ళాడు.

"గవర్నర్ మహాశయా! మీతో ఒక ముఖ్యమైన విషయం ముచ్చటించాలి. అలా అశ్వశాలకు వెళ్దాం వస్తారా?" అన్నాడు క్విక్సోట్.

ఇద్దరూ కలిసి అశ్వశాల వద్దకు వచ్చారు!

"ఏమిటి మహావీరా, మీరు చెప్పబోయే ఆ ముఖ్య విషయం?" అని పూట కూళ్ళ ఇంటి యజమాని అడిగాడు.

క్విక్సోట్ అటు యిటు చూసాడు. ఎవరూ లేరని నిర్ధారణ చేసుకున్న తర్వాత అమాంతం ఇంటి యజమాని కాళ్ళమీద పడిపోయాడు.

"ఏమిటిది ప్రభూ?" అన్నాడు ఇంటి యజమాని ఏమీ అర్థంగాక.

"గవర్నరు మహాశయా! మీరు కూడా యోధులేనని నాకు తెలుసు. నా కోరిక నొకదానిని మీరు మన్నించాలి. అలాగని మాట యివ్వనిదే నేను మీ పాదాలు విడిచి పెట్టను" అన్నాడు క్విక్సోట్ దీనంగా ముఖం పెట్టి.

క్విక్సోట్ మాటలు, చేష్టలు ఇంటి యజమానికి ఆశ్చర్యాన్ని కలిగించాయి.

"ఎవడీ పిచ్చివాడు? ఇతడి కోరికను మన్నించకపోతే కాళ్ళు వదలనంటున్నాడు. అదేమిటో తెలుసుకుంటాను" అనుకున్నాడు ఇంటి యజమాని.

"వీరాగ్రేసరా! మహావీరా! మీ వంటి మహోన్నత వ్యక్తి కోరిక మన్నించడం నా పూర్వ పుణ్య విశేషంగా భావిస్తున్నాను. దయచేసి ఆ కోరిక ఏమిటో సెలవీయండి!" అన్నాడు ఇంటి యజమాని.

"అయితే నా కోరిక వినండి! నన్నింతవరకూ ఎవరూ 'మహాయోధుడు'గా ప్రకటించలేదు. ఆ పని మీరు చేయాలి. తెల్లవారగానే చేయాలి. చేస్తానని వాగ్దానం చేసారు కాబట్టి నేను మహాయోధుడనని మీరు ప్రకటించక తప్పదు" అన్నాడు క్విక్సోట్.

"అలాగే చేస్తాను." అన్నాడు ఇంటి యజమాని.

"మంచిది గవర్నర్ మహాశయా! ఈ రాత్రికి నేను నా పవిత్రమైన ఆయుధాలను మీ కోటలోని దేవాలయమందు దైవసాన్నిధ్యంలో ఉంచి వాటికి తెల్లవార్లూ కాపలా కాస్తాను. అప్పుడు నా ఆయుధాలు అజేయ మవుతాయి" అంటూ క్విక్సోట్ సాహస వీరుల గాథలను వారు చేసిన సాహస కృత్యాలను ఎంతోసేపు ఇంటి యజమానికి వివరించి చెప్పాడు.

ఆ మాటలు వినగానే ఇంటి యజమానికి మతిపోయింది. అతడి ఇంటిలో దేవాలయం కాదు గదా కనీసం దేవుని పటం కూడా లేదు.

"యోధాగ్రేసరా! మీ నిర్ణయం అమోఘం! అయితే ఇందులో చిన్న చిక్కు ఉంది మహావీరా! అదేమంటారా?....మా కోటలో ఉన్న పాత దేవాలయం శిథిలమై పోతే దాని స్థానంలో కొత్త దేవాలయం నిర్మించాలనే సదుద్దేశంతో పాత దేవాలయాన్ని పడగొట్టించాను. కొత్త దేవాలయం నిర్మాణం యింకా ప్రారంభించలేదు. అయినా మీకు ఎటువంటి ఇబ్బందీ లేని ఏర్పాటు నేను చేస్తాను. నేను చూపించిన ప్రదేశంలో మీ ఆయుధాలు కవచాన్నీ భద్రపర్చుకోండి. వాటికి తెల్లవార్లూ కాపలా కాయండి. తెల్లవారిన తర్వాత కొన్ని ముఖ్యమైన కార్యాలు నెరవేర్చిన తర్వాత మిమ్మల్ని 'మహాయోధుడు' బిరుదుతో సత్కరిస్తాను. సరేనా?" అన్నాడు ఇంటి యజమాని.

అప్పటికిగాని డాన్ క్విక్సోట్ ఇంటి యజమాని వాదాలు విడిచి పెట్టలేదు.

"వీడెవడో అమాయకుడు. వీడి వద్దనుండి ఎలాగైనా సరే డబ్బు గుంజాలి" అనుకున్న ఇంటి యజమాని క్విక్సోట్‌తో యిలా అన్నాడు :

"అది సరేగానీ యోధాగ్రేసరా! మీ వద్ద ఏమైనా డబ్బు ఉందా? ఉంటే ఎంత ఉంది? ఎందుకంటే మీకు బిరుదు ప్రదానం చేయాలంటే ఖర్చులకు డబ్బు కావాలి కదా!" అన్నాడు ఇంటి యజమాని.

"డబ్బా!....నా దగ్గర చిన్న రాగి నాణెం కూడా లేదు. యోధులు తమతో బాటు డబ్బు తీసుకు వెళతారని నేను చదివిన పుస్తకాలలో ఎక్కడా రాసిలేదు. అందువల్ల నేను డబ్బు తెచ్చుకోలేదు" అన్నాడు క్విక్సోట్ దీనంగా ముఖంపెట్టి.

క్విక్సోట్ సమాధానం ఇంటి యజమానికి కోపం తెప్పించింది.

అయినా తమాయించుకుని "యోధాగ్రేసరా! మీరు చాలా పొరబాటు అభిప్రాయంలో ఉన్నారని చెప్పక తప్పదు. గొప్ప గొప్ప యోధులు సాహస యాత్రలకు బయలుదేరినప్పుడు అనుచరులనూ, మంచి మంచి దుస్తులనూ, తదితర విలువైన వస్తువులనూ, ఎంతో ధనాన్ని తమతోబాటు తెచ్చుకుంటూ ఉంటారు. ఆ యోధుల సంపదను అతడి అనుచరులే రక్షిస్తూ ఉంటారు. కనుక మీరు ఇక ముందు సాహస యాత్రలకు బయలు దేరేటప్పుడు నేను చెప్పిన విషయాలను గుర్తుంచుకోండి! ఇలా సలహా యిచ్చినందుకు ప్రభువులు నన్ను మన్నించాలి" అన్నాడు.

"మీ సూచన గుర్తుంచుకుంటాను" అన్నాడు క్విక్సోట్.

## 3

ఆ రాత్రి డాన్ క్విక్సోట్ తన కవచాన్ని గుర్రాలు నీళ్ళు తాగే తొట్టెలో వేసి చేతిలో బల్లెం పుచ్చుకుని కవచానికి కాపలా కాయడం ప్రారంభించాడు.

నెత్తిమీద శిరస్త్రాణం, చేతిలో బల్లెం, నీటి తొట్టెలో కవచం, క్విక్సోట్ దానికి కాపలా కాయడం చూసినవాళ్ళు కడుపుబ్బ నవ్వడం ప్రారంభించారు. బాగా



డాన్ క్విక్సోట్ తన కవచానికి కాపలాగా ఉండటం

పొద్దుపోయిన తర్వాత అందరూ హాయిగా నిద్రపోయారు. క్విక్సోట్ తన కవచానికి అలా కాపలా కాస్తూనే ఉన్నాడు.

అంతలో ఒకడు తన కంచర గాడిదకు నీళ్ళు తాగించటానికి నీటి తొట్టె దగ్గరకు వచ్చాడు. తొట్టెలో ఉన్న ఇనుప కవచాన్ని చూసి చిరాకుపడ్డాడు. దానిని

యివతల పారేద్దామన్న తలంపుతో చేతిని తొట్టెలో పెట్టబోయాడు.

అప్పుడు డాన్ క్విక్సోటు అతడ్ని హెచ్చరిస్తూ "ఓయ్ మిత్రమా! ప్రపంచ ప్రసిద్ధి గాంచిన అపార పరాక్రమశాలి అయిన యోధాగ్రేసరుడు ధరించే కవచమది. దానిని ముట్టుకోడానికి గూడ ధైర్య సాహసాలు కావాలి. ఆ కవచాన్ని ముట్టుకోవద్దని హెచ్చరిస్తున్నాను. ముట్టుకున్నావో నీకు ప్రాణాపాయ స్థితితప్పదు. నా హెచ్చరికను పెడచెవినిపెట్టావంటే నా కత్తికి నువ్వు బలికాకతప్పదు. జాగ్రత్త!" అన్నాడు.

కంచర గాడిద యజమానుడు డాన్ క్విక్సోటు వంక అవహేళనగా చూసాడు. ఆ తర్వాత తొట్టెలోని కవచాన్ని పైకి తీసి దూరంగా విసరివేసాడు.

ఆ అవమానాన్ని భరించలేని క్విక్సోట్, మహోగ్రరూపం ధరించి, చేతిలోని బల్లెం పైకెత్తి దానితో కంచరగాడిద యజమాని నెత్తిమీద బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు దిమ్మతిరిగి అతడు నేలమీద స్పృహతప్పి పడిపోయాడు.

"హ్హా....హ్హా... హ్హా! నేను మొట్టమొదటి విజయం సాధించాను. ఎప్పుడైనా సరే, విజయం నాదే!" అంటూ డాన్ క్విక్సోట్, కవచాన్ని ఎత్తి తిరిగి తొట్టెలో పడవేసాడు.

కొద్ది క్షణాలు గడిచిన తర్వాత, ఇంకొకడు తన కంచర గాడిదలను తోలుకుని, తొట్టె దగ్గరకు వచ్చాడు. వాడు తొట్టెలోని కవచాన్ని చూసాడు. దానిని తీసి అవతల పారవేయబోయాడు. క్విక్సోట్ అతడ్ని హెచ్చరించాడు. వాడు వినకపోయేసరికి, బల్లెంతో వాడి నెత్తిమీద బలంగా కొట్టాడు.

రెండోవాడు ఆ దెబ్బకు నేలమీద పడడమైతే పడ్డాడు కానీ, మూర్ఛపోలేదు. నెత్తిమీద గాయం పడి, నెత్తురు కారసాగింది.

దానితో వాడు పెద్దగా పెడబొబ్బలు పెడుతూ "వీడెవడో కానీ, నన్ను చంపేసాడురా దేవుడోయ్!....అయ్యలారా! చప్పున వచ్చి, నన్ను యీ వికృతాకారుడి నుండి రక్షించండి తండ్రులారా!" అంటూ కేకలు వేయసాగేడు.

ఆ కేకలకు పూటకూళ్ళ ఇంటిలో నిద్రిస్తున్నవారంతా లేచి అక్కడకు చేరుకున్నారు. పెడబొబ్బలు పెట్టినవాడి స్నేహితులు కొందరు అక్కడ ఉన్నారు. వాళ్ళు ఏం జరిగిందో తెలుసుకున్నారు. ఆలస్యం చేయకుండా చేతికందిన రాళ్ళను తీసుకుని క్విక్సోట్ మీదికి గురిచూసి విసరడం ప్రారంభించారు.

పరిస్థితిని గమనించిన క్విక్సోట్ అటువంటి ప్రమాద పరిస్థితిలో ఏం చేయాలా! అని ఆలోచించాడు. చదివిన పుస్తకాలలోని సంఘటనలను గుర్తు చేసుకున్నాడు.

వెంటనే, ఒర నుండి ఖడ్గం యివతలికి తీసాడు. పక్కనే వున్న డాలును ఎడమచేత్తో పుచ్చుకున్నాడు. తనవేపు బాణాల్లా దూసుకువస్తున్న రాళ్ళను ఖడ్గంతో నరుకుతూ, డాలుతో అడ్డుకుంటూ, రాళ్ళ దెబ్బలనుండి తప్పించుకో సాగేడు.

"ఒరేయ్! మదాంధులారా! నన్ను సామాన్య వ్యక్తిగా భావిస్తున్నారురా, నరాధములారా! నన్ను ఎవరనుకుంటున్నారురా!.... అరివీర భయంకరుడను!.... అజేయుడను!- ఇలా నా దగ్గరకు రండిరా, రండి! నా కత్తి పదును ఏపాటిదో మీకు రుచిచూపిస్తాను. ఒక్క వేటుకు మీ అందరి మస్తకాలు తెగనరకకపోతే, నా పేరు వీర విక్రమ డాన్‌క్విక్సోటే కాదు" అంటూ క్విక్సోట్, ఖడ్గాన్ని గాలిలో తిప్పుతూ కదం తొక్కడం ప్రారంభించాడు.

అంతలో అక్కడికి పూటకూళ్ళ ఇంటియజమాని వచ్చాడు. పరిస్థితిని గమనించాడు. ఏమాత్రం ఆలస్యం చేసినా పరిస్థితి చేయిదాటిపోతుందని గ్రహించాడు.

"మిత్రులారా! రాళ్ళు రువ్వకండి! శాంతం వహించండి! ఆ మహాయోధుని నేను సమాధానపర్చుతాను" అని చెప్పి వాళ్ళను శాంతింపజేసాడు.

ఆ తర్వాత డాన్‌క్విక్సోట్ దిక్కుతిరిగి "యోధాగ్రేసరా! నా యీ ప్రజలు మీపట్ల అనుచితంగా ప్రవర్తించినందుకు నేనెంతయో సిగ్గుపడుతున్నాను. వీళ్ళను దయతో క్షమించవలసినదిగా ప్రార్థిస్తున్నాను" అన్నాడు.

"మంచిది గవర్నరు మహాశయా! ఘనబుద్ధి కలవాడిని కనుక అందర్నీ క్షమిస్తున్నాను. ఎవరికి ఎటువంటి హానీ చేయనని, అభయమిస్తున్నాను. ఎక్కడి వారక్కడ నిర్భయంగా వెళ్ళిపోవచ్చును" అన్నాడు క్విక్సోట్.

పూటకూళ్ళ ఇంటి యజమాని, క్విక్సోట్ తప్ప అందరూ వెళ్ళిపోయారు.

'ఈ పిచ్చివాడ్ని ఎలాగైనా వదిలించుకోకపోతే, తన వ్యాపారానికే దెబ్బ తగిలేటట్టు వున్నది' అనుకున్నాడు పూటకూళ్ళ ఇంటి యజమాని.

"ఓ యోధాగ్రేసర చక్రవర్తీ! అనతి కాలంలోనే మీ అపూర్వ శౌర్య పరాక్రమాలతో మమ్ములనందర్నీ ఆనంద డోలికలో పరవశింపజేసారు. మిమ్ములను

ఎలా అభినందించాలో తెలియడం లేదు. మీరు అనుమతిస్తే యీ క్షణంలోనే మిమ్ము లను మహాయోధునిగా ప్రకటిస్తాను. అందుకు నాకు ఎటువంటి అభ్యంతరమూ వుండదు. మీ అభిప్రాయమేమిటో సెలవిస్తే ఆనందిస్తాను." అన్నాడు పూటకూళ్ళ ఇంటి యజమాని.

"మీ నిర్ణయమే నా నిర్ణయం. నా ధైర్యసాహసాలను మీరు చక్కగా



2. డాన్‌క్విక్సోట్ యోధుడయ్యాడు.

అర్థం చేసుకున్నందుకు ఎంతైన కృతజ్ఞుడను!" అన్నాడు క్విక్సోట్.

పూటపూళ్ళ యజమాని కార్యక్రమానికి ఉపక్రమించాడు. అతడు చెప్పిన విధంగా డాన్‌క్విక్సోట్ అతడి ముందు మోకాళ్ళపై కూర్చున్నాడు. పూటకూళ్ళ యజమాని ఓ పద్దుల పుస్తకం తీసుకొచ్చి ఏవో ప్రార్థనలు చదువుతున్నట్టుగా

నటించాడు. ఒక కుర్రవాడు పెద్ద కొవ్వొత్తిని వెలిగించి తెచ్చి వాళ్ళ ప్రక్కగా నిలుచున్నాడు. ఇద్దరు యువతులు వచ్చి అటు యిటు నిలుచుని స్తోత్ర గీతాలు ఆలపించసాగేరు. ఇంటి యజమానుడు క్విక్సోటు కత్తి తీసుకుని దానిని క్విక్సోటు రెండు భుజాలకు తాకించాడు.

ఆ తర్వాత ఇంటి యజమాని "డాన్‌క్విక్సోట్ పేరుగలఓ మహా వీరా! .... ఈ క్షణంనుండే మీరు మహాయోధులని ఈ కోటకు గవర్నర్ అయిన నేను భగవంతుని సాక్షిగా ప్రకటిస్తున్నాను." అన్నాడు.

దానితో డాన్‌క్విక్సోట్ మహాయోధుడయ్యాడు!....

ప్రతియోధుని దగ్గర కొంత డబ్బు మంచి దుస్తులు ఒక సేవకుడు ఉండడం అత్యవసరమని ఇంటి యజమాని క్విక్సోట్‌ను మరొకసారి హెచ్చరించాడు.

ఈ లోగా తెల్లవారింది. క్విక్సోట్ కవచం ధరించాడు. ఇంటివద్ద నుండి బయలుదేరిన క్షణం నుంచీ శిరస్త్రాణం అతడి నెత్తిమీదనే వుంది. కత్తి తీసి ఒరలో పెట్టుకున్నాడు. అశ్వశాలనుండి గుర్రాన్ని తెచ్చి దాన్ని అధిరోహించాడు.

తర్వాత ఇంటి యజమాని వద్ద సెలవు తీసుకుని గుర్రాన్ని ముందుకు పోనిచ్చాడు. పూటకూళ్ళ ఇంటి యజమానికి రాగి నాణెం కూడా ఇవ్వలేదు. ఇవ్వటానికి అతడి వద్ద డబ్బంటూ వుంటేకదా! ఇంటి యజమాని కూడా డబ్బు అడగటానికి భయపడ్డాడు, తనను గవర్నరుగా భావిస్తున్నప్పుడు తను మాత్రం డబ్బు ఎలా అడుగుతాడు? ఒకవేళ ధైర్యం చేసి అడిగినా! మహాయోధుడ్ని! నన్ను డబ్బు అడుగుతావా? అని ఖడం తీసి పీకతెగనరుకు తాడేమోనని కూడా ఇంటి యజమాని భయపడ్డాడు.

డాన్‌క్విక్సోట్ తన బక్క గుర్రం మీద కొంత దూరం ప్రయాణం సాగించాడు. అంతలో అతడి బుర్రలో ఓ ఆలోచన చోటుచేసుకుంది.

'గవర్నర్ మహాశయుడు యదార్థమే వచించాడు. మహాయోధుని వద్ద ధనం ఉండాలి. సేవకుడు కూడా ఉండాలి. ఈ రెండూ లేనివాడు యోధుడేకాడు!' అనుకొన్నాడు క్విక్సోటు.

మరుక్షణం అతడు గుర్రాన్ని వెనక్కి మళ్ళించి గృహోన్ముఖుడయ్యాడు. అతడలా తిరిగి వస్తుండగా ఎవరో ఏడుస్తూ పెడబొబ్బలు పెడుతున్న శబ్దం

వినిపించింది. క్విక్సోటు గుర్రాన్ని ఆపి ఏడుపు వినిపిస్తున్న దిక్కుగా చెవులు రిక్కించి విన్నాడు.

'అహో! ఇది ఎవరో బాలుడి ఆర్తనాదం సుమా! ఆ పసివాడిని ఎవరో బాధలు పెడుతున్నారు. ఆపదలో వున్నవారిని ఆదుకోవడమేకదా యోధుని ప్రథమ కర్తవ్యం! నేనిదే వెళ్ళి ఆ దీనుణ్ని రక్షిస్తాను.' అనుకొని క్విక్సోటు తన గుర్రాన్ని అటుగా పరిగెత్తించాడు.



3. బాలుని విడుదల చేయవలసిందని క్విక్సోటు హెచ్చరించటం

అక్కడ బాలుడొకడు చెట్టుకు కట్టి వేయబడి ఉన్నాడు. ఒక వ్యక్తి బాలుడికి ఎదురుగా నిలబడి సన్నటి బెత్తంతో ఆ కుర్రవాడిని కొడుతూ కనిపించాడు. కుర్రవాడిని కొడుతున్న వ్యక్తి క్విక్సోట్ దృష్టికి ఓ యోధుడిగా కనిపించాడు.

వెంటనే క్విక్సోట్ "యోధుడా! ఆగు! ఆ బాలుడ్ని కొట్టకు! ఆ కుర్రవాడు నిస్సహాయ స్థితిలో ఉన్నాడు. చేత ఆయుధమైనాలేని నిరాయుధుడు. నీ కంటె చాలా చిన్నవాడు. అటువంటి వాడిని చెట్టుకు కట్టిపెట్టి కొట్టడం వీరలక్షణం కాదు. కనుక ఆ బాలుడ్ని విడిచిపెట్టండి!.... నా మాటను మన్నించకపోతే, నా ఖడ్గానికి పని చెప్పవలసి వస్తుంది. ఆలోచించుకో!" అన్నాడు.

అప్పుడా వ్యక్తి క్విక్సోట్‌తో యిలా అన్నాడు:

"మహాపురుషా! ఈ బాలుడి విషయంలో నేను చెప్పబోయే సంజాయిషీని శాంతంగా ఆలకించండి! ఈ బాలుడు నా సేవకుడు. ఈ కుర్రవాడు నా గొర్రెల మందను కాస్తూ ఉంటాడు. వీడి అజాగ్రత్త వల్ల, నా గొర్రెలు కొన్ని నూతిలో పడి చనిపోయాయి. వీడికి యివ్వవలసిన జీతం యిచ్చి పనిలోనుండి తీసివేసాను. నేను గొర్రెల నష్టాన్ని వీడినుండి రాబట్టలేదు. అయినా సరే జీతం యివ్వలేదనీ, వీడి డబ్బు నేను అపహరించాననీ పదిమందికీ చెప్పుకుంటూ తిరుగుతున్నాడు. అందుకనే వీడిని ఈ విధంగా శిక్షిస్తున్నాను. నాకు వేరేమార్గం లేకపోయింది. మరొక మార్గం ఏదైనా ఉంటే మీరే చెప్పండి!" అన్నాడా వ్యక్తి.

"నీ యజమాని నీకు ఎంత డబ్బు యివ్వాలి?" క్విక్సోట్ బాలుడ్ని ప్రశ్నించాడు.

"నాకు తొమ్మిది నెలల జీతం యివ్వాలి. చాలాకాలంగా అడుగుతున్నాను. అయినా యింతవరకు యివ్వలేదు." అన్నాడు బాలుడు.

క్విక్సోట్ ఆ వ్యక్తితో "నువ్వు యీ బాలుడికి యివ్వవలసిన తొమ్మిది నెలల జీతాన్ని తక్షణమే యిచ్చివెయ్! లేకపోతే నువ్వు నా కత్తికి బలి అవుతావు." అన్నాడు.

"నా డబ్బు యింటి దగ్గర ఉంది. కుర్రవాడు నా వెంట వస్తే ఇంటి దగ్గర యిస్తాను."

బాలుడు అతడి వెంట వెళ్ళేందుకు నిరాకరిస్తూ "ఇతడు కపటి. ఇంటికి తీసుకువెళ్ళి నన్ను గదిలో కట్టిపెట్టి కొడతాడు. డబ్బు యివ్వడు" అన్నాడు.

అప్పుడు క్విక్సోట్ ఆ వ్యక్తితో యిలా అన్నాడు:

"నేను ప్రస్తుతం అత్యవసర కార్యంమీద మా గ్రామం వెళుతున్నాను. ఎప్పటికైనా తిరిగి వస్తాను. నువ్వు ఈ బాలుడికి డబ్బు యివ్వనట్లు అప్పుడు నాకు తెలిసిందో నిన్ను నా ఖడ్గంతో ఖండ ఖండాలుగా నరికి కాకులకూ, గ్రద్దలకూ ఆహారంగా వేస్తాను. ఇదినా ప్రతిజ్ఞ! నేను గొప్ప యోధుడను. యోధులు ఆడినమాట తప్పరు తెలుసా?" అన్నాడు క్విక్సోట్.

దానికి ఆ వ్యక్తి అంగీకరించాడు. అంతటితో తన దీనజనోద్ధరణ పూర్తి అయిందని భావించిన క్విక్సోట్ తిరిగి ప్రయాణం సాగించాడు. ఆ వ్యక్తి బాలుడి కట్లు విప్పి వదిలేసాడా? లేదా? అన్నది క్విక్సోట్ ఆలోచించలేదు. క్విక్సోట్ చాలా దూరం వెళ్ళిపోయి ఉంటాడని, నిర్ధారణ చేసుకున్న ఆ వ్యక్తి తిరిగి కర్రతో బాలుణ్ని బాదడం ప్రారంభించాడు.

డాన్‌క్విక్సోట్ ఆ విధంగా కొంతదూరం ప్రయాణం చేసిన తర్వాత కొంతమంది వర్తకులు ఎండ తగులకుండా గొడుగులు వేసుకుని సేవకులతో అటుగా వస్తూ కనిపించారు. క్విక్సోట్ దృష్టికి వారంతా మహాయోధులుగా కనిపించారు. అటువంటి వారితో చేసిన పోరాటమే జగద్విఖ్యాతమవుతుందని భావించాడు.

"ఓ యోధులారా! ఆగండి! నేను చెప్పేది వినండి! ప్రపంచ ప్రసిద్ధి గాంచిన వీరాధివీరుడూ మహావీరాగ్రేసర చక్రవర్తీ అయిన డాన్‌క్విక్సోట్ ముందు నిలబడి ఉన్నారని తెలుసుకోండి! నేను చెప్పబోయే విషయాన్ని అతిశ్రద్ధగా ఆలకించండి! నా హృదయేశ్వరి డల్సీనియా రాకుమారి ప్రపంచంలోని అందగత్తెలైన యువతులందరిలోకీ అందమైన సుందరి అని మీరు వెళ్ళిన చోటనల్లా ఎలుగెత్తి చాటి చెప్పాలి. మీరు ఆ విధంగా చేయని పక్షంలో నాతో మీరు యుద్ధం చేయక తప్పదు. ఆ యుద్ధంలో నేను మీ శిరస్సులు ఖండించక తప్పదు. ఏమంటారు?" అన్నాడు క్విక్సోట్.

వర్తకులు ఒకరి ముఖాలొకరు అయోమయంగా చూసుకున్నారు.

వాళ్ళల్లోని వర్తకుడొకడు ముందుకు వచ్చి "అయ్యా! మహాయోధా! మీరు చెబుతున్న ఆ డల్సీనియా రాకుమారిని మేము యింతవరకు చూడలేదు. మేము ఆమె అందచందాలను చూడకుండా ఆమె ప్రపంచంలోనే అందగత్తె అని ఎలా చెప్పగలం? కనుక మీరు ఆమెను ముందుగా మాకు చూపించండి!" అన్నాడు.

క్విక్సోట్ కళ్ళెరజేస్తూ "డల్సీనియా రాకుమారి అందగత్తె అని నేను

చెబుతున్నాను కదా! నా మాటలలో మీకు నమ్మకం లేదా? నేను చెప్పినట్టు చేయక పోయారో మిమ్మల్ని నా ఖడ్గంతో చంపి యిక్కడే మీ శవాలను భూస్థాపితం చేసే స్తాను" అన్నాడు.

"ఎవడీ మూర్ఖుడు? ఒరలో ఖడ్గం కూడా ఉంది. వీడు చెప్పినట్లు చేయక పోతే అన్నంతపనీ చేసేలాగ ఉన్నాడు" అనుకున్నారు వర్తకులు.



4. వర్తకులతో డాన్ క్విక్సోట్

అయినా ఆ వర్తకుల్లో గడసరి వాడొకడు ముందుకొచ్చి "ఇంతకీ డల్సే నియా రాకుమారిని మీరు చూసారా? లేదా? బహుశా చూడలేదనే అనుకుంటు న్నాను. ఆమె ప్రపంచ సుందరి అయితే ఆమెను అందరూ ఎలాగూ పొగుడుతారు. బహుశా ఆమెకు కుంటి కాలూ, కుంటి చెయ్యీ, తప్పడ ముక్కూ, మెల్లకన్నో,

గుడ్డికన్నో ఉండి ఉండవని నమ్మకమేమిటి?" అంటూ అవహేళన చేసాడు.

ఆ మాటలు వినగానే డాన్ క్విక్సోటు ఉగ్రరూపంధరించాడు. ఒక యోధాగ్రేసరుని ప్రియురాలిని అవహేళన చేసిన వ్యక్తి బ్రతికి ఉండేందుకు వీలులేదని క్విక్సోట్ నిర్ణయించుకున్నాడు.

వెంటనే చేతిలోని బల్లెపు మొనను ఆ వర్తకుడి గుండెలకు గురిపెట్టి, బక్క గుర్రాన్ని ఒక్కసారే గట్టిగా అదిలించాడు.

క్విక్సోట్ హెచ్చరికకు ఆదమరచి నిలుచున్న బక్క గుర్రం అదిరిపడి ముందుకు దూసుకుపోవాలని, శక్తినంతా కూడదీసుకుని ముందరికాళ్ళను ముందుకు దూకించింది. అయితే తిండి సరిగాలేక కాళ్ళల్లో బలం కరువై, అమాంతం నేలమీద విరుచుకుపడిపోయింది. దానితోబాటే వీరాధి వీరుడైన డాన్ క్విక్సోట్ కూడా నేల మీద పడిపోయాడు. అతడి రెండు కాళ్ళూ గుర్రం నడుముకు బిగించి కట్టిన రికాబులలో చిక్కుకుపోయాయి. గుర్రం పైకి లేవలేకపోయింది. క్విక్సోటు పైకి లేచేందుకు విశ్వ ప్రయత్నం చేయసాగేడు. అయితే అతడు ధరించిన కవచం చాలా బరువుగా వుండటంవల్ల అతడి ప్రయత్నాలేవీ సాగలేదు. తొట్టెలోపడ్డ ఎలుక పిల్లలాగ అటు యిటు కొట్టుకుంటున్న మహాయోధుడ్ని చూసి వర్తకులు నవ్వుకున్నారు.

"ఈ మూర్ఖ శిఖామణి మనల్ని చంపేపాటి మొనగాడా! ఇటువంటి పిచ్చి ప్రలాపాలు పలికే వాడికి సహాయం చేయకూడదు. పదండి పోదాం!" అనుకుంటూ వర్తకులు ముందుకు సాగిపోయారు.

ఆ వర్తకుల సేవకులలోని ఓ గడుసుపిండం వెనక్కి ఆగి క్విక్సోట్ దగ్గరగా వచ్చి "నీ దెయ్యం ముఖానికి డల్సీనియా రాకుమారి కావాలా?" అంటూ చేతిలోని దుడ్డుకర్రతో క్విక్సోటు శిరస్త్రాణం మీద బలంగా కొట్టాడు.

ఆ దెబ్బకు క్విక్సోట్ తల అదిరిపోయింది. ఆ సేవకుడు అంతటితో ఊరుకోక నేలమీద పడిఉన్న బల్లెల్ని తీసి మధ్యకు విరిచి, అవతలికి గిరవాటు వేసాడు. అతడు యింకా ఏం చేసేవాడో కానీ వర్తకులు వెనుదిరిగి పిలవడంతో క్విక్సోట్‌ను కాలితో తన్ని పరిగెత్తుకొంటూ వెళ్ళిపోయాడు.

క్విక్సోట్‌కు ఏం చేయాలో తోచలేదు. గుర్రం లేవలేదు. అతడు చాలా సేపు అలాగే పడి ఉన్నాడు.

అంతలో ఆ దారినే ఒక వ్యక్తి వస్తూ క్విక్సోట్ పడుతున్న అవస్థను గమనించాడు. అతడు డాన్‌క్విక్సోట్ గ్రామానికి చెందినవాడే. అతడు క్విక్సోట్ కాళ్ళను రికాబుల నుంచి విడిపించాడు. ఆ తర్వాత బక్క గుర్రాన్ని లేపదీసాడు. క్విక్సోట్ మాత్రం పైకిలేచి నిలబడ లేకపోయాడు. పాపం! అతడి శరీరం అతడి స్వాధీనంలో లేదు.

ఆ వ్యక్తి క్విక్సోట్‌ను ఎత్తి తన కంచర గాడిద మీద కూర్చుండబెట్టి, గుర్రాన్ని నడిపించుకుంటూ గ్రామం చేరుకున్నాడు.

క్విక్సోడా ఏమైపోయాడా! అని విచారసాగరంలో మునిగి ఉన్న అతడి మేనకోడలు, సేవకుడు, స్నేహితులైన మతాధికారి, మంగలి, మొదలైన వారంతా ఇంటికి చేరుకున్న క్విక్సోడాను చూస్తూనే ఎంతో ఆనందించారు.

"ఇన్నాళ్ళూ ఎక్కడున్నావు?" అని అడిగారు.

క్విక్సోట్‌కు నోటమాట రాలేదు. అతడికి చాలా నీరసంగా ఉంది. అతడి కడుపులో ఎలుకలు పరిగెడుతున్నాయి. దాహంతో గొంతు పిడచగట్టుకు పోయింది. అటువంటి పరిస్థితిలో శ్రేయోభిలాషులకు ఏమని సమాధానం చెప్పగలడు?

సేవకుడు వడ్డించిన రుచికరమైన భోజనం కడుపునిండా తిన్నాడు. పుష్టిగా మత్తు పానీయం సేవించాడు. ఆ తర్వాత బాగా మత్తెక్కి మంచమెక్కి హాయిగా గుర్రుపెట్టి నిద్రపోయాడు.

ఆ ఎక్కిన మంచాన్ని మన యోధుడు చాలారోజుల వరకూ దిగలేదు. స్నేహితులూ, శ్రేయోభిలాషులూ వచ్చి పరామర్శ చేస్తుండేవారు. ఇకమీదటనైనా బుద్ధి కలిగి ఇంటిపట్టునే ఉండమని, సలహాలు చెప్పడం ప్రారంభించారు.

"మీరంతా కూపస్థమండూకాలు! ఈ చిన్న గ్రామమే మీకు ప్రపంచం! కానీ నా వంటి మహాయోధుడికి అలాకాదు. నేను చూడవలసిన ప్రపంచం చాలా ఉంది. చేయవలసిన దీనజనరక్షణ ఎంతో ఉంది. విశ్వకళ్యాణం కోసం పుట్టిన మహానుభావుడ్ని నేను. దుష్టశిక్షణ, శిష్టరక్షణ నా ధ్యేయం!.... అందుకోసం నేనింకా ఎన్నో పుస్తకాలు చదవాలి. విజ్ఞానాన్ని ఆర్జించాలి!" అన్నాడు క్విక్సోట్ ఒకనాడు.

క్విక్సోటు మేనకోడలు, సేవకుడు, మతాధికారి, మంగలి ఒకచోట సమావేశమయ్యారు.

"క్వికోస్సాడా ఇంటి పట్టునే ఉండాలంటే, ఇంటిలో ఉన్న పుస్తకాలను తగుల బెట్టడం తప్ప గత్యంతరం లేదు." అన్నాడు మతాధికారి.

దానికి మిగతావారు అంగీకరించారు. క్విక్సోట్‌కు తెలియకుండా పుస్తకా లన్నిటినీ ఒకచోట పేర్చి, దహన సంస్కారం జరిపించారు. దానితో ఒక్క పుస్తక మైనా మిగులకుండా అన్నీ పరశురామ ప్రీతి అయిపోయాయి.

కొన్నిరోజులకు క్వికోస్సాడా బలం పుంజుకుని మామూలు మనిషి అయ్యాడు. ఓ శుభముహూర్తం చూసుకుని పుస్తక పఠనం ప్రారంభించడానికి గదిలోకి వెళ్ళి చూసాడు. అక్కడ మచ్చుకు ఒక్క పుస్తకం కూడా కనిపించలేదు.

రంకెలు వేస్తూ సేవకుడ్ని పిలిచి అడిగాడు!

దానికి అతడి మేనకోడలు విచారంగా ముఖం పెట్టి "ఏం చెప్పమంటావు మామయ్యా! నువ్వు మంచం మీదపడి ఉన్నప్పుడు ఎవడో మాంత్రికుడు వచ్చాడు. నీ పుస్తకాలను తగులబెట్టి నీ మీద కక్ష తీర్చుకున్నాడు. మేము ఎంత వారించినా మా మాట వినలేదు." అని చెప్పింది.

క్విక్సోట్ దీర్ఘంగా ఆలోచిస్తూ "అవును! ఆ మాంత్రికుడు నాకు బాగా తెలుసు. వాడు దుర్మార్గుడు. వాడు నాకు పరమ శత్రువైన ఫ్రెస్టన్! వాడే నా పుస్తకాలను తగులబెట్టి ఉంటాడు. అందులో సందేహం అణుమాత్రం కూడాలేదు. నేను పుస్తకాలు చదివి అమిత బలవంతుడనవుతానని వాడు ఎప్పటినుండో నన్ను కనిపెట్టుకొని ఉన్నాడు. నేను మంచం మీదపడి వున్నప్పుడు ఈ పని చేసాడు. ఆ నీచుడ్ని ఊరికెనే విడిచిపెట్టను. ఏ నాటికైనా వాడిమీద పగ తీర్చుకొంటాను. ఓరీ మాంత్రికా ధమా!....నువ్వు పాతాళలోకంలో వున్నాసరే నిన్ను పట్టి బయటికి ఈడ్చి సంహరిస్తాను. కాచుకో! ఇదే నా ప్రతిజ్ఞ!" అన్నాడు.

అప్పటికి గండం గడిచినందుకు ఇంటిలోనివారు హాయిగా ఊపిరి పీల్చు కున్నారు.

## 4

కొన్ని రోజులవరకూ క్విక్సోటు ఇంటివద్దనే కాలక్షేపం చేసాడు. అతడు బాగు పడ్డాడు. ఇక ఎక్కడికీ వెళ్ళడు అనుకొన్నారు అతడి స్నేహితులు అయితే వాళ్ళకు తెలియకుండా క్విక్సోటు తన సాహసయాత్రలకు సన్నాహాలు చేయ సాగేడు.

క్విక్సోట్ గ్రామంలోనే కూలీనాలీ చేసుకొని, జీవించే పనివాడు ఒకడు న్నాడు. వాడి పేరు 'శాంకోపాంజా' వాడు గొప్ప తెలివితేటలు కలవాడు కాదు. కానీ క్విక్సోట్ లాగ మూర్ఖుడు మాత్రం కాదు.

శాంకోపాంజాకు కోరికలు ఎక్కువ తాను ధనవంతుడు కావాలనీ పెద్ద హోదాలో అధికారం చెలాయించాలనీ రోజూ కలలు కంటూ ఉండేవాడు.

ఒక రోజున శాంకోపాంజా క్విక్సోట్‌కు తారసపడ్డాడు. తనకు సేవకుడు కావాలి కనుక వీడే తనకు తగిన సేవకుడు అని ఓ నిర్ణయానికి వచ్చాడు క్విక్సోట్.

"మిత్రమా! శాంకో! నేనొక మహాయోధుడనని నీకు తెలుసుకదా! రేపో మాపో నేను సాహసయాత్రలకు వెళదమనుకొంటున్నాను. నాకొక సేవకుడు కావాలి. ఆ పనికి నువ్వే తగినవాడివని నా నిశ్చితాభిప్రాయం. ఈసారి నేను అనేక దీవులను జయించాలనుకుంటున్నాను. ఆ దీవులలోని ఓ పెద్దదీవికి నిన్ను గవర్నరుగా నియమిస్తాను. నీ పురోభివృద్ధికి ఇది మంచి అవకాశం!....బాగా ఆలోచించుకో!" అన్నాడు క్విక్సోట్.

డాన్‌క్విక్సోట్ మాటలు శాంకోపాంజా చెవులకు అమృతతుల్యంగా వినిపించాయి.

"ప్రభూ! మీరు చెప్పినట్టు చేయడానికి ఈ సేవకుడు సిద్ధంగా వున్నాడు. మీరు అగ్నిలో దూకమన్నా దూకుతాను. మీరు నన్ను అనుగ్రహించాలి." అన్నాడు శాంకో.

క్విక్సోటు అతడి సమాధానానికి ఎంతో సంతోషించాడు. మన యోధుడికి సేవకుడు లభించాడు. తర్వాత కావలసింది డబ్బు మంచిదుస్తులు! ....వాటిని గూడ క్విక్సోటు సమకూర్చుకున్నాడు.

ఒకనాటి అర్ధరాత్రి క్విక్సోటు తన బక్క గుర్రాన్ని శాంకో తన కంచర గాడిదనూ తీసుకొని ఎవ్వరికంటా బడకుండా సాహసయాత్రలకు బయలుదేరారు.

మార్గ మధ్యంలో శాంకో యోధుడితో "మహావీరా! మీరు చేసిన వాగ్దా నాన్ని జ్ఞాపకం వుంచుకోవాలి సుమా! మీరు తప్ప "కుండా నన్నొక పెద్ద దీవికి గవర్నర్‌ని చేయాలి. చేస్తారు కదా ప్రభూ" అన్నాడు.

"పిచ్చివాడా! యోధుడనేవాడు తాను చేసిన వాగ్దానాన్ని ఎన్నటికి మరచి పోడు. నీవు తప్పకుండా గవర్నర్ పదవిని పొందుతావు. నేను తలుచుకుంటే ఒక మహా సామ్రాజ్యాన్నే జయించి దానికి నిన్ను చక్రవర్తిని చేయగలను." అన్నాడు క్విక్సోటు.

శాంకోపాంజా ఉప్పొంగిపోయాడు. ఇరువురూ ఎన్నో అపూర్వమైన విషయాలను మాట్లాడుకొంటూ ప్రయాణం సాగించారు.

చివరకు వాళ్ళు ఓ పెద్ద మైదానం చేరుకున్నారు. అక్కడ షుమారు వలభై గాలిమరలు ఉన్నాయి. యోధుడు వాటిని చూసాడు. అటువంటి గాలిమర లను అతడు యింతకు క్రితం చూసి ఉండకపోవడంవల్ల ఎంతో ఆశ్చర్యపోయాడు.

"చూశావా శాంకో! విశాలమైన బాహువులున్న ఆ రాక్షసాధములను గమ నించావా? వారు నన్ను యుద్ధానికి రమ్మని కాలు దువ్వుతున్నారు. నా శౌర్య పరాక్రమాలు ఏమిటో వారికి చూపిస్తాను. నా ఖడ్గ ధారలతో, ఆ రాక్షసుల శరీ రాలను ఛిన్నాభిన్నం చేసి, విజయం సాధిస్తాను చూడు!" అన్నాడు క్విక్సోడా.

శాంకో ఆశ్చర్యపోతూ నలుదిక్కులా దృష్టి సారించి చూచాడు. అయితే అతడికి, తనుచూపు దూరంలో ఎక్కడా రాక్షసుడన్నవాడే కనిపించలేదు; గాలి మరలు తప్ప!

"ఎక్కడ ప్రభూ రాక్షసులు?" అని అడిగాడు శాంకో.

క్విక్సోట్ గాలి మరలవేపు చేయెత్తి చూపించాడు.

"ప్రభూ! మీరు భ్రమపడుతున్నారు. అవి రాక్షసులు కాదు. వాటిని గాలి మరలు అంటారు" అన్నాడు శాంకో.

"శాంకో! నీకు బొత్తిగా లోకజ్ఞానం లేదు. ఇటువంటి రాక్షసాధములు మా వంటి మహా యోధులముందు ప్రత్యక్షమై కవ్విస్తూ ఉంటాయనీ, నేను చాలా పుస్త కాలలో చదివాను. నీకు భయంగా ఉంటే, దూరంగా నిలబడి, నా వీరవిహారాన్ని చూస్తూ ఉండు" అన్నాడు క్విక్సోట్ ఉద్వేగంతో.

అదే సమయంలో, గాలి ఉధృతంగా వీచింది. దానితో గాలిమరలు విపరీత మైన వేగంతో తిరుగుతూ, పెద్ద సవ్వడి చేయసాగాయి.

"విశ్రమించకండి! ఇదే వస్తున్నాను. కాచుకోండి!" అంటూ, క్విక్సోట్ తన బక్కచిక్కిన 'రోజినాంటి' గుర్రాన్ని గాలి మరలవేపు వేగంగా పోనిచ్చాడు.

డాలును అడ్డు పెట్టుకుని, బల్లేన్ని చేతధరించి, వేగంగా ముందుకు దూసుకొచ్చిన క్విక్సోట్, బల్లెంతో ఓ గాలిమరను బలంగా పొడిచాడు.

ఏముంది!— అమిత వేగంతో తిరుగుతున్న గాలిమర ఆకులు అతడి



**5. గాలిమరలతో పోరాటం**

బల్లేన్ని ముక్కలు ముక్కలుగా త్రుంచిపారేసాయి. అంతేనా!— ఆ వేగాన్ని తట్టుకోలేని అతడి గుర్రం 'రోజినాంటి' నేలమీద పడిపోయింది. డాన్ క్విక్సోట్ గిరగిరా తిరుగుతూ వచ్చి నేలమీద ఎత్తి కుదేసిన పుచ్చకాయలా పడ్డాడు. దానితో అతడికి బాగా గాయాలు తగిలాయి.

డాన్ క్విక్సోట్ సాహస కృత్యాన్ని దూరంగా నిలబడి విడ్డూరంగా చూస్తున్న శాంకోపాంజా తన యజమాని భంగపాటును గమనిస్తూనే, అతడి వద్దకు పరిగెత్తుకుంటూ వచ్చాడు. అప్పటికి, క్విక్సోట్ నెమ్మదిగా లేచి బాధతో మూల గడం ప్రారంభించాడు.

"చూసారా ప్రభూ! నేను అనుకున్నదంతా అయింది. ఇక్కడ రాక్షసులు ఎవరూ లేరు. మీరు గాలిమరతో యుద్ధం చేసారు. ఇటువంటి పనికిమాలిన కృత్యాన్ని ఏ యోధుడైనా చేస్తాడా? మీరు ఇకనైనా జాగ్రత్తగా ఉండాలి. మీకు ఏమైనా అయి పోతే నా గవర్నర్ పదవి ఏంగాను?" అన్నాడు శాంకోపాంజా విచారంగా.

అప్పుడు డాన్‌క్విక్సోట్ గంభీరముద్ర వహించి యిలా అన్నాడు : "యోధులు ఎప్పుడూ పిరికి మాటలు ఆలకింపరు. ఇకముందు ఎన్నడూ నా ముందు పిరికి మాటలు మాట్లాడకు. నేను మొదట చూసినప్పుడు యిక్కడ రాక్షసాధములు గుంపులుగా నిలబడి ఉన్నారు. మాంత్రికుడైన ఆఫ్రెస్టన్ నీచుడు, నాగర్భ శత్రువు కదా!....వాడు రాక్షసులందర్నీ గాలిమరలుగా మార్చివేసాడు. నేను రాక్షసులను వధించి విజయం సాధిస్తాననే అసూయతో యీ పని చేసాడు. ఆ దుర్మార్గుడు ఎన్ని మంత్రాలు ప్రయోగించినా, ఎన్ని కుతంత్రాలు పన్నినా చివరకు విజయం నాదే! ఇది ముమ్మాటికి నిజం!...."

శాంకో పాంజా నోరు మెదపలేదు. రోజినాంటి లేచి నిలబడటానికి సహాయ పడ్డాడు: ఆ తర్వాత డాన్ క్విక్సోట్ గుర్రాన్ని అధిరోహించే విషయంలో కూడా సహాయం చేసాడు.

తిరిగి ఇద్దరూ ముందుకు ప్రయాణం సాగించారు. తన బల్లెం ముక్కలై నందుకు క్విక్సోట్ చాలా బాధపడ్డాడు. అయితే అతడికి తను పుస్తకాలలో చదివిన ఓ విషయం గుర్తుకొచ్చింది.

అదేమంటే—మహావీరులు యుద్ధాలలో తమ ఆయుధాలను పోగొట్టు కుంటే, వాటికోసం విచారిస్తూ కూర్చోరు. ఏ చెట్టుకొమ్మనో విరిచి దానితో ఓ కర్రను తయారుచేసుకుని దానినే ఆయుధంగా ఉపయోగిస్తారని.

వెంటనే క్విక్సోట్‌కి కొండంత ధైర్యం వచ్చింది. అటు యిటు చూసాడు. దూరంగా ఓ పెద్దచెట్టు కనిపించింది. గుర్రాన్ని ఆ చెట్టువద్దకు పోనిచ్చాడు. గుర్రం వీపుమీద నిలబడి చెట్టుకొమ్మ నొకదానిని విరిచాడు. ఆకులు, రెమ్మలు లాగిపారేసి పొడవాటి చేపాటి కర్రను తయారుచేసుకున్నాడు.

అయితే గాలిమర దయవలన కలిగిన గాయాలు క్విక్సోట్‌ను బాధించ సాగేయి. అతడు గుర్రంమీద సరిగా కూర్చోలేకపోతున్నాడు. మెలికలు తిరిగి పోసాగేడు. అది శాంకోపాంజా గ్రహించాడు.

"ప్రభూ! మీకు యుద్ధంలో బలమైన గాయాలు తగిలాయి. మరుక్షణమే ప్రయాణం ప్రారంభించారు. మనం ఎక్కడయినా కొంతసేపు విశ్రాంతి తీసుకోవడం క్షేమకరం" అన్నాడు శాంకోపాంజా.

శాంకో మాటలు మహాయోధుడికి ఆగ్రహం తెప్పించాయి.

"శాంకో! నాకీ గాయాలు లెక్కలోనివికావు. యోధుడనేవాడు కష్టాలనూ, గాయాలనూ తలుచుకుని బాధపడడు. యోధుల నిఘంటువులో 'గెలుపు' అనే పదం తప్ప 'ఓటమి' అనేమాట ఉండదు. తెలుసుకో!" అన్నాడు క్విక్సోట్.

ఆ తర్వాత వాళ్ళు చీకటిపడేవరకు ప్రయాణం చేసారు. అప్పటికి వాళ్ళు ఓ నిర్జన ప్రదేశానికి చేరుకున్నారు. తమ వాహనాలను చెట్టుకు కట్టేసి చెట్టుక్రింద విశ్రమించారు.

వాళ్ళవద్ద ఆహారంలేదు. తాగడానికి పానీయంలేదు.

"ప్రభూ! నామాటకేమిగాని మీరు ఆకలిదప్పులతో విశ్రమించడం నాకెంతో బాధగా వుంది. ఎక్కడికయినా వెళ్ళి ఏదయినా తీసుకువద్దామన్నా ఈ గాఢాంధ కారంలో ఎక్కడికని వెళ్ళను" అన్నాడు శాంకో బాధగా.

క్విక్సోట్ గంభీరంగా ముఖంపెట్టి "చూడు శాంకో! నేను మహాయోధుడనని నీకు ఎన్నిసార్లు గుర్తుచేయాలి?—నిజమైన యోధుడు ఆకలిదప్పులను దరికి చేరనీయడు. అంతేకాదు, నిద్రాదేవినికూడా దగ్గరకు రానీయడు. అతడు తన హృదయాధి దేవత నామాన్ని జపిస్తూ రాత్రి యావత్తూ గడిపేస్తాడు. నేనూ అంతే" అన్నాడు.

శాంకోపాంజాకు అతడి మాటలు అర్థంకాలేదు. అతడితో తనకేమిటని హాయిగా చెట్టుక్రింద పడుకుని నిద్రపోయాడు. డాన్ క్విక్సోట్ మాత్రం తన ఊహా సుందరి డల్సీనియా నామజపం చేస్తూ నిద్రపోకుండా అలాగే కూర్చున్నాడు.

తెల్లవారింది. తిరిగి ఇద్దరూ తమ తమ వాహనాల మీద బయలుదేరారు. చివరకు వాళ్ళు లూసిన్ కనుమ వద్దకు చేరుకున్నారు.

అక్కడ, క్విక్సోట్, శాంకోపాంజాతో యిలా అన్నాడు :

"శాంకో! నేను చెప్పేది జాగ్రత్తగా విను! నేను ప్రారంభింపబోయే అతి

భయంకరమైన సాహస కృత్యాలు యిక్కడ నుండే మొదలు కాబోతున్నాయి. నేను కత్తుక వరకూ అపాయాలలో, ప్రమాదాలలో కూరుకుపోయి ఉంటాను. అందువలన, నువ్వు ఓ ముఖ్య విషయాన్ని జ్ఞాపకముంచుకోవాలి.''

"ఏమిటి ప్రభూ అది?" శాంకో ప్రశ్నించాడు.

"నేను మహా యోధులతో పోరాడుతున్నప్పుడు కానీ, గాయాలతో నేలపై కూలబడినప్పుడు కానీ. నీవు శత్రువులపై కత్తి దూయకూడదు. వారిని ఎదిరించ కూడదు'' అన్నాడు క్విక్సోట్.

"అదేమిటి ప్రభూ! యజమానిని కాపాడుట సేవకుని కర్తవ్యం కాదా?"

"కర్తవ్యం కంటే ధర్మం ముఖ్యం శాంకో! ఒక వీరుడితో మరొక వీరుడు యుద్ధం చేయాలే తప్ప, సేవకులు కత్తి పట్టరాదు. అది వీర ధర్మంకాదు'' అన్నాడు క్విక్సోట్.

"మీరు చెప్పినట్లే చేస్తాను. అయితే నాకొక సందేహం ప్రభూ!"

"ఏమిటది శాంకో?"

"మీతో యుద్ధం చేస్తున్న వీరుడు మిమ్మల్ని విధివశాత్తూ నేలకు పడగొట్టిన తర్వాత అతడు నా మీదికి వస్తే, నేను కత్తి దూయాలా? వద్దా?" అన్నాడు శాంకో.

క్విక్సోట్ నవ్వి "ఎంత తెలివితక్కువ వాడివి శాంకో! ఏ ప్రాణి అయినా తన ప్రాణ రక్షణ ముఖ్యమని భావిస్తుంది కదా! అటువంటి విపత్కర పరిస్థితుల్లో ఆయుధం పట్టడం తప్పు కాదు. అయితే నాకు మాత్రం సహాయం చేయకూడదు'' అన్నాడు.

ఇద్దరూ తిరిగి ప్రయాణం సాగించారు. ఒకనాటి మిట్టమధ్యాహ్న సమయానికి వారు ఓ మైదాన ప్రాంతానికి చేరుకున్నారు.

అక్కడ ఓ మంచినీటి ప్రవాహం వేగంగా సాగిపోతున్నది. ఇద్దరూ తమ తమ వాహనాలను దిగారు. వాటిని స్వేచ్ఛగా విడిచిపెట్టారు. సెలయేటిలో హాయిగా స్నానం చేశారు. వెంట తెచ్చుకున్న భోజనాన్ని ఆరగిస్తూ సెలయేటి గట్టున కూర్చున్నారు.

ఆ ప్రాంతంలోనే మరికొన్ని గుర్రాలు పచ్చిక మేస్తూ రోజినాంటి గుర్రానికి కనిపించాయి. స్వజాతి గుర్రాలు కనిపించేసరికి రోజినాంటికి ఎక్కడలేని హుషారు పుట్టుకొచ్చింది. అది గబగబా వెళ్ళి ఆ గుర్రాలతో కలిసిపోయింది. అయితే, ఆ మేలుజాతి గుర్రాలకు, బక్కచిక్కిన రోజినాంటిని చూడగానే అసహ్య

మనిపించింది కాబోలు, అవి అన్నీ ఏకమై ఒక్క గుర్రాన్ని ముట్టెలతో పొడిచి, కాళ్ళతో తన్ని తరిమేసాయి. ఆ గుర్రాలను అధిరోహించి వచ్చిన అశ్వికులు కూడా కర్రలు తీసుకుని, రోజినాంటిని చావకొట్టారు. పాపం! రోజినాంటి నేల మీద పడి పోయింది.



6. గుఱ్ఱములపై వచ్చినవారు క్విక్సోట్, శాంకోలను కొట్టుట.

తన ఉత్తమాశ్వానికి పట్టిన దుస్థితిని డాన్ క్విక్సోట్ చూడనే చూసాడు. శాంకోపాంజా కూడా చూసాడు. ఆ దుర్మార్గులకు తగిన ప్రతీకారం చేయాలని ఇద్దరూ నిశ్చయించుకున్నారు.

"వాళ్ళు ఇరవై మంది ఉన్నారు ప్రభూ! ఇద్దరం వాళ్ళను ఎదిరించగలమా?" శాంకోపాంజా అనుమానాన్ని వెలిబుచ్చాడు.

"నీవు రావద్దు!....వాళ్ళకు నేనొక్కడినే చాలు! అలా చూస్తూ ఉండు!" అంటూ క్విక్సోట్ చేతికర్రను తీసుకుని, వారి మీదికి యుద్ధానికి వెళ్ళాడు.

కర్ర తీసుకుని తమ మీదికి వస్తున్న మహాయోధుడ్ని అశ్వికులు చూసారు. వెంటనే తలకొక కర్ర తీసుకున్నారు. క్విక్సోట్ వాళ్ళతో ఒక్క నిముషం కర్రతో యుద్ధం చేసాడు. ఆ ఇరవైమంది కర్రదెబ్బలకు క్విక్సోట్ కర్ర ఎగిరి చక్కాపోయింది. ఆ తర్వాత వాళ్ళ కర్ర దెబ్బలు క్విక్సోట్ మీద వర్షంలా పడ్డాయి. అడ్డుకునేందుకు వచ్చి శాంకోపాంజా కూడా కర్రదెబ్బల నుండి తప్పించుకో లేకపోయాడు.

నేలమీద పడిపోయిన ఇద్దర్నీ వదిలేసి అశ్వికులు తమ తమ గుర్రాలను అధిరోహించి తమ దారిన వెళ్ళిపోయారు.

కొంతసేపటికి ఇద్దరూ లేచి కూర్చున్నారు. శరీరానికి అంటుకున్న మట్టిని దులుపుకున్నారు. ఏమీ జరుగనట్లు ఠీవిగా తమ వాహనాలను అధిరోహించి తిరిగి ప్రయాణం సాగించారు.

కొంతదూరం వెళ్ళిన తర్వాత వాళ్ళకొక పూటకూళ్ళ భవనం కనిపించింది. "ఇక్కడ ఓ చక్కని కోట ఉంది. విశ్రాంతి తీసుకుందాం పద!" అన్నాడు క్విక్సోట్.

శాంకోపాంజా సమాధానం చెప్పే స్థితిలో లేడు. అతడి శరీరం యావత్తూ హూనమైపోయింది. చిన్నగా మూలగడం ప్రారంభించాడు.

"నా సేవకుడు కొండ పైనుండి దొర్లి క్రిందపడ్డాడు. గాయాలు తగిలాయి. ఈ రాత్రికి మీ కోటలో విశ్రాంతి తీసుకుంటాం" అన్నాడు క్విక్సోటు పూటకూళ్ళ యజమానితో.

ఆ ఇంటి యజమాని ఓ పెద్ద గదిలో వాళ్ళకు మంచాలు ఏర్పాటు చేసాడు. అతడి భార్య, కూతుళ్ళు వాళ్ళిద్దరికీ ఎన్నో ఉపచారాలు చేసారు. రుచికరమైన పదార్థాలు తినడానికి యిచ్చారు. ఆ రాత్రి ఇద్దరూ హాయిగా ఆదమరచి నిద్రపోయారు.

తెల్లవారింది!.... ఇద్దరూ లేచారు. ఇద్దరికి స్వస్థత చిక్కింది. క్విక్సోటు ఇంటి యజమాని వద్దకొచ్చి తన కృతజ్ఞతలు తెలియజేసుకున్నాడు.

"గత రాత్రి మీ కోటలో హాయిగా విశ్రాంతి తీసుకున్నాము. మీరంతా ఆత్మీయులుగా ఆదరించారు. అందుకు మేము ఎంతైనా కృతజ్ఞులం!.... సెలవిస్తే పోయి వస్తాము." అన్నాడు క్విక్సోటు.

"మీరు ఆ విధంగా పొగడవలసిన అవసరం లేదు. అది మా వృత్తి ధర్మం. ఆ విధంగా సేవ చేయకపోతే మా జీవితాలు గడిచేదెలా చెప్పండి?.... మీకు మేము పెట్టిన భోజనానికి చేసిన సేవలకు అమర్చిన మంచాలకు డబ్బు చెల్లించి మరీ వెళ్ళండి!.... మీరు అనుకుంటున్నట్టు ఇది కోట కాదు. పూటకూళ్ళ ఇల్లు!" అన్నాడు ఇంటి యజమాని వినయంగా.

క్విక్సోటు ఆశ్చర్యపోతూ "ఏమిటీ! ఇది పూటకూళ్ళ ఇల్లా! కోట కాదూ? అయినా ఇప్పుడేమి కొంపలు అంటుకున్నాయిలే!.... నా వంటి మహాయోధుడు మీ వంటి చిన్న పూటకూళ్ళ ఇంటికొచ్చి మీ ఆతిథ్యం స్వీకరించడం నిజంగా మీ అదృష్టమనే మీరు భావించాలి. మీకిది ఎంతో గౌరవప్రదమైన విషయం దీనికి నువ్వు గర్వించికపోగా డబ్బు అడుగుతున్నావంటే చాలా సిగ్గుచేటైన విషయం సుమా! పూర్వపురోజులలో ఎవ్వరూ మహాయోధులను డబ్బు అడిగేవారు కాదు కనుక నువ్వు కూడా నన్ను డబ్బు అడుగకూడదు. తెలిసిందా?" అని చెప్పి ఒక్క గుర్రాన్ని వేగంగా ముందుకు దౌడు తీయించాడు.

అయితే శాంకోపాంజా మాత్రం వెనక్కి దిగబడిపోయాడు. అదే సమయంలో ఇంటి యజమాని శాంకోను పట్టుకుని డబ్బిచ్చి మరీ కదులు అన్నాడు. డబ్బు యివ్వటానికి శాంకో నిరాకరించాడు.

అంతట ఇంటి యజమాని పెద్ద కంబళిని తెప్పించాడు. కొంతమంది పని వాళ్ళు కంబళి నాలుగు చెరగులూ బిగించి పట్టుకున్నారు. నలుగురు వ్యక్తులు శాంకోను కంచర గాడిద మీది నుండి క్రిందికి లాగారు. ఆ తర్వాత అతన్ని పైకెత్తి కంబళిలో పడేసారు. తర్వాత వాళ్ళు కంబళిని పైకి క్రిందికి ఎగరేయడం ప్రారంభించారు.

పాపం! శాంకో పాంజా కంబళితోబాటు పైకి క్రిందికి ఎగరడం ప్రారంభించాడు. వాళ్ళు కంబళిని వదిలేస్తే తను తిన్నగా వచ్చినేలమీద పడడం ఖాయం. అలా పడితే తన తలకాయ పుచ్చకాయలాగ పగలడం ఖాయం అనుకున్న శాంకో ప్రాణభయంతో బిగ్గరగా కేకలు వేయడం ప్రారంభించాడు.

శాంకో ఏడుపులు గుర్రం మీద వెళుతున్న క్విక్సోట్ చెవినిపడ్డాయి. వెంటనే అతడు గుర్రాన్ని వెనక్కి మళ్ళించి తిరిగి పూటకూళ్ళ ఇంటికి చేరుకున్నాడు. అక్కడ శాంకో అనుభవిస్తున్న దుస్థితిని గమనించాడు.

"దుర్మార్గాంధులారా! తక్షణమే నా సేవకుడ్ని విడిచిపెట్టండి! లేకపోతే నా శౌర్య పరాక్రమాలు చూపించవలసి వస్తుంది." అంటూ క్విక్సోటు చర్రున ఒర



శాంకోపాంజాను పైకి ఎగురవేసి కంబళితో పట్టుకోవటం

నుండి ఖడ్గాన్ని యివతలికి తీసాడు.

దానితో బెదిరిపోయిన జనులు కంబళివదిలేసి తలకొక దిక్కూ పారిపోయారు. శాంకోకు తల అయితే పగలలేదు కానీ నడ్డివిరిగినంత పనైంది.

శాంకో గబగబా వెళ్ళి తన కంచరగాడిదను అధిరోహించాడు. ఇద్దరూ

తిరిగి ప్రయాణం కొనసాగించారు.

"మన డబ్బు నీ దగ్గర సురక్షితంగానే ఉందికదూ?" అని అడిగాడు క్విక్సోట్ శాంకోను.

"ఉంది ప్రభూ! వాళ్ళు ఎంత బాధించినా చివరకు బాధలనైనా భరించాను కానీ రాగి నాణెం కూడా వారికి యివ్వలేదు. ప్రభువులధనాన్ని కాపాడగలిగానన్న



డాన్ క్విక్సోట్ బిస్కేకు చెందిన వానిని పడగొట్టుట!

తృప్తి నాకు మిగిలితే చాలు ప్రభూ!" అన్నాడు శాంకోపాంజా.

సేవకుడి ప్రభుభక్తి పరాయణతకు క్విక్సోట్ ఎంతో సంతోషించాడు.

## 5

వాళ్ళ ప్రయాణం అలాసాగుతూనే వుంది. తన యజమానుడు దీవులను

జయించడం తనను పెద్ద దీవికి గవర్నర్ చేయడం గగన కుసుమమేమోనన్న అనుమానం శాంకో మనసులో మెదిలింది.

అతడొకనాడు క్విక్సోట్‌తో "ప్రభూ! మనం ఎంత దూరం ప్రయాణం చేసినా ఆపదలూ ప్రమాదాలే ఆహ్వానిస్తున్నాయి తప్ప. ఎటువంటి అదృష్టమూ మనల్ని వరించడంలేదు. కనుక మనం యీ సాహసకృత్యాలకు స్వస్తి చెప్పి ఇంటికి పోవడమే క్షేమకరమని నాకు తోస్తున్నది. ఇంటి వద్దనైతే కడుపులో నీళ్ళు కదలకుండా హాయిగా జీవించవచ్చుకదా! దయచేసి నా మాట వినండి!" అన్నాడు.

"చూడు శాంకో! కష్టపడినవాడే ఫలితాన్ని పొందగలడు. ఓర్పు వహించు! నేను విజయాన్ని సాధించడం ఎంతసత్యమో నీవు గవర్నర్‌వి కావడం కూడా అంతే సత్యం! నా మాట నమ్ము!" అన్నాడు క్విక్సోట్.

అతడి మాటలను శాంకో తిరస్కరింపలేక పోయాడు. కొన్ని రోజులు ప్రయాణం చేసిన తర్వాత వారికి బిస్కేకు చెందిన ఓ వ్యక్తి తారసపడ్డాడు. అతడివద్ద ఖడ్గం వుంది.

"నువ్వు వీరుడవే అయితే నాతో యుద్ధంచెయ్! నిన్ను జయించి వీరాధి వీరుడనసే పెరును సార్థకం చేసుకుంటాను" అన్నాడు క్విక్సోటు ఒరనుండి ఖడ్గం తీస్తూ.

ఆ వ్యక్తికి యుద్ధం చేయక తప్పలేదు. ఇద్దరూ కత్తులతో కొంతసేపు యుద్ధం చేసారు. దురదృష్టవశాత్తు ఆ వ్యక్తి నేలమీద పడిపోయాడు. అతడికి కత్తి దెబ్బతగిలి గాయమైంది. గాయంనుండి రక్తం కారసాగింది.

అయితే క్విక్సోటు కూడా ఆ వ్యక్తి కత్తి దెబ్బలనుండి తప్పించుకోలేక పోయాడు. ఆ వ్యక్తి విసిరిన కత్తి దెబ్బకు క్విక్సోట్ శిరస్త్రాణం తాలూకు కొంత భాగం విరిగిపడి పోయింది. అంతేకాదు. అతడి కుడిచెవి తెగి నేలమీదపడింది. దానికి క్విక్సోట్ ఎంతో దుఃఖించాడు. చెవి తెగిపడిపోయి నందుకుగాదు. అమూల్యమైన తన శిరస్త్రాణం విరిగిపోయి నందుకు.

"నేలమీద పడిపోయిన ఈ యోధుడికి శిరస్త్రాణం లేదు. ఉంటే ఇతడి శిరస్త్రాణాన్ని విజయ చిహ్నంగా పొంది ఉండేవాడిని! అయినా మించిపోయిన

దేమీలేదు. నేను మరొక యుద్ధంలో నా శత్రువును జయించి, అతడి శిరస్త్రాణాన్ని విజయ చిహ్నంగా సంపాదించేవరకు నేలమీదనే నిలబడి భోజనం చేస్తాను. బల్లమీద కూర్చోను. ఇదే నా ప్రతిజ్ఞ!" అన్నాడు క్విక్సోట్.

ఒకనాడు వాళ్ళిద్దరూ ఓ గ్రామం నుండి మరొక గ్రామానికి బయలు దేరారు. మార్గ మధ్యంలో వారికొక వ్యక్తి తన గాడిదమీద ఎక్కివస్తూ కనిపించాడు.

అతడ్ని చూస్తూనే క్విక్సోట్ ఎంతో సంతోషిస్తూ "చూసావా శాంకో! ఎవడో మహావీరుడు నెత్తిన బంగారు శిరస్త్రాణం ధరించి యిటే వస్తున్నాడు. నేను ఆ వీరుడ్ని జయించి ఆ సువర్ణ శిరస్త్రాణాన్ని విజయ చిహ్నంగా పొందుతాను. చూడు" అన్నాడు.

శాంకో గాడిదమీద వస్తున్న ఆ వ్యక్తిని చూస్తూనే ఆశ్చర్యపోయి "ప్రభూ! మీరు పొరబడుతున్నారు. అతడు మహావీరుడు కాదు. మామూలు సీదా సాదా మనిషి. అతడు గాడిద ఎక్కి వస్తున్నాడు. మహావీరుడైతే గాడిదను ఎక్కి వస్తాడా చెప్పండి? ఎండకాంతిలో అతడు నెత్తిన పెట్టుకున్న వస్తువు ఏదో తళ తళ మెరుస్తున్నది. అంతే తప్ప అది బంగారు శిరస్త్రాణం మాత్రం కాదు" అన్నాడు.

అప్పుడు క్విక్సోట్ శాంకోతో "చూడు శాంకో! నువ్వు ఎప్పుడూ ఇలాగే మాట్లాడుతూ ఉంటావు. యధార్థ మేమిటో నీ కళ్ళకు గోచరించదు. అందుకే నువ్వు సేవకా వృత్తిలోనే ఉండిపోయావు. పరీక్షగా అటు చూడు!....అతడు మహావీరుడు! 'అతడు ఎక్కివస్తున్నది ఉత్తమాశ్వం!' అతడు నెత్తిన ధరించినది సువర్ణ మణిమయ శిరస్త్రాణం!....నేను ఆ వీరుడ్ని జయించి, శిరస్త్రాణాన్ని చేజిక్కించుకుంటాను. చూడు" అన్నాడు.

వాస్తవానికి గాడిదమీద వస్తున్న వాడొక మంగలి. వాడు అక్కడున్న రెండు గ్రామాలకు, తన గాడిదమీద తిరుగుతూ క్షుర కర్మలు చేస్తూ ఉంటాడు. అతడి నెత్తిన ఉన్నది ఓ ఇత్తడి పాత్ర! ఎండ తీవ్రంగా ఉండటంవల్ల వాడు ఆ ఇత్తడి పాత్రను నెత్తిన బోర్లించుకుని సూర్యతాపం నుండి రక్షణ పొందాడు. దానిని మన యోధుడు బంగారు శిరస్త్రాణం అనుకున్నాడు.

వెంటనే క్విక్సోట్ తన చేతిలో ఉన్న బల్లేన్ని ఎదురుగా వస్తున్న మంగలి గుండెలకు గురిపెట్టి తన బక్క గుర్రాన్ని వేగంగా పోనిచ్చాడు.

మంగలి ఈ దృశ్యాన్ని చూసాడు. ముంచుకొస్తున్న ప్రమాదాన్ని గమనించాడు. ప్రమాదం దగ్గరకు రాకముందే అమాంతం గాడిద పైనుండి నేలమీదికి దూకి వెనుదిరిగి పరిగెత్తడం ప్రారంభించాడు. వాడు ముందూ, క్విక్సోట్ వెనుకా అలా కొంతదూరం వెళ్ళారు. ఆ పరుగు పందెంలో మంగలివాడి నెత్తిన ఉన్న ఇత్తడి పాత్ర కాస్తా ఎగిరి నేలమీద పడిపోయింది. వాడు దానిని అలాగే వదిలేసి



9. డాన్ క్విక్సోట్ మంగలితో పోరుట.

ప్రాణాలు దక్కించుకున్నాడు.

క్విక్సోట్ కు కావలసింది శిరస్త్రాణం. తమత, నేలమీద పడిన ఇత్తడి పాత్ర దగ్గర 'రోజి నాంటి' నిలబడిపోయింది. క్విక్సోటు దానిని తీసుకుని అమిత సంతోషంతో నెత్తిన పెట్టుకున్నాడు. అంతలో శాంకోపాంజా తన కంచర గాడిదమీద

అక్కడికి చేరుకున్నాడు.

తన యజమాని నెత్తిన బోర్లించి వున్న ఇత్తడి పాత్రను చూస్తూనే శాంకో పాంజా తనలోనే నవ్వుకున్నాడు.

"చూసావా శాంకో! ఇది మంత్ర మహిమ గల సువర్ణ శిరస్త్రాణం! ఇదీ ఓ దుర్మార్గుడి చేతిలో పడింది. ఇది బంగారం కావడంవల్ల వాడు దీనిని సగం కరిగించి అమ్ముకుని తినేసాడు. అందుకే దీని ఆకారం ఇలా ఉంది. మనం మహా సామ్రా



10. డాన్‌క్విక్సోట్ గొఱ్ఱెలపై దాడి చేయటం

జ్యాన్ని జయించిన తర్వాత ఉత్తముడైన స్వర్ణకారుని పిలిపించి దీనిని బాగు చేయిస్తాను" అన్నాడు క్విక్సోట్.

శాంకోపాంజాకు ఏం చెప్పాలో తోచలేదు. ఏమి చెప్పినా యజమానుడు

నమ్మే స్థితిలో లేడు. కనుక శాంకో నోరు మెదపలేకపోయాడు.

తరువాత వాళ్ళ ప్రయాణం ఎప్పటి మాదిరిగా కొనసాగింది.

ఒకనాడు క్విక్సోట్, దూరంగా ఆకాశాన్ని కప్పిన ఓ ధూళి మేఘాన్ని చూసాడు. ఒక గొప్ప సైనికదళం అటుగా వస్తున్నదని భావించాడు.

"ఇక్కడ రెండు సైనిక దళాలు, ఘోరంగా పోరాడబోతున్నాయి. ఈ దృశ్యాన్ని చూసి తీరవలసిందే! శాంకో! మనం ఎత్తైన ప్రదేశానికి వెళ్ళి అక్కడి నుండి, పోరాటాన్ని చూద్దాం పద!" అన్నాడు క్విక్సోట్ శాంకోతో.

ఇద్దరూ ఆ సమీపంగా ఉన్న ఓ ఎత్తైన ప్రదేశం మీదికి చేరుకున్నారు. వాళ్ళలా చూస్తుండగా కొంతమంది తమ తమ గొర్రెల మందలను తోలుకుంటూ అటుగా రాసాగేరు. వాళ్ళ చేతుల్లో కొమ్మలను నరికే కత్తులూ, కొడవళ్ళూ, పోద వాటి కర్రలూ ఉన్నాయి.

"ఇదేమిటి? ఇక్కడ రెండు గొప్ప సైనిక దళాలు భీకర పోరాటం కొనసాగిస్తారని నేను ఆశపడితే, ఈ రాక్షసుల గుంపు వస్తున్నదేమిటి? నేను పోరాటాన్ని చూడటానికి బదులు, స్వయంగా నేనే పోరాటం సాగించవలసివస్తున్నదే!" అన్నాడు క్విక్సోట్.

"ప్రభూ! మీరు భ్రమపడుతున్నారు. ఆ వచ్చేది రాక్షసుల గుంపు కాదు. గొర్రెలమంద! మీరు ఇందాక చూసిన ధూళి మేఘంకూడా ఈ గొర్రెల మందదే. సైనిక దళానిది కాదు ప్రభూ! నిరపాయకరమైన జంతువులతోనూ, సామాన్యమైన మనుషులతోనూ యుద్ధం చేయడం వీరోచిత లక్షణం కాదు. పైగా అలా చేయడం వల్ల మన శరీరాలకు ముప్పు వాటిల్లుతుందే తప్ప, ఫలితం శూన్యం" అన్నాడు శాంకో.

మన యోధుడు శాంకో మాటలను గడ్డిపోచలుగా తీసిపారేసి, తన దగ్గరగా వచ్చిన గొర్రెల మందలోకి అమాంతం ఎగిరి దూకాడు.

క్విక్సోట్ కోపావేశంలో ఉన్నాడు. అతడి చేతిలో ఖడ్గం ఉన్నది. అతడు మందలో దుమికిన మరుక్షణం, స్వైరవిహారం చేయసాగేడు. వేటుకొక గొర్రెను తెగ నరకడం ప్రారంభించాడు.

గొర్రెల కాపరులు అది చూసి నివ్వెరపోయారు. ఎవడో పిచ్చివాడు కత్తి చేతబట్టి మందలోకి చొరబడ్డాడని గ్రహించారు.

వెంటనే తలకొక రాయి తీసుకుని క్విక్సోట్ మీదికి బలంగా విసరడం ప్రారంభించారు. గొర్రెల కాపరులు విసురుతున్న రాళ్ళు క్విక్సోట్ మీద వర్షంలా పడడం ప్రారంభించాయి. కొన్ని రాళ్ళు అతడి తలకు తగిలాయి. ఓ పెద్ద రాయి వచ్చి అతడి ప్రక్కటెముకలకు చాలా బలంగా తగిలింది. క్విక్సోట్‌కు అది యమబాధను కలిగించింది.



11. దొంగ శాంకోపాంజా గాడిదను దొంగిలించుట

వెంటనే అతడు తన వద్దనున్న ఓ సీసాను పైకి తీసి "ఇది సర్వబాధా నివారిణి ఔషధం" అంటూ మూత తీసి, సీసాను నోటివద్ద పెట్టుకోబోయాడు.

అంతలో ఓ రాయి విసురుగా వచ్చి సీసాకు తగిలింది. దానితో సీసా ముక్కలు ముక్కలై పోయింది. అంతేకాదు; ఆ రాయి క్విక్సోట్ మూతి పళ్ళను

కూడా రాలకొట్టింది. ఆ దెబ్బకు అతడు నేల మీద వెల్లకిలా పడిపోయాడు. అతడు చనిపోయాడని భయపడిన గొర్రెల కాపరులు, గొర్రెల మందలను అక్కడే విడిచి పెట్టి, తలకొక దిక్కు పారిపోయారు.

దూరంగా నిలుచుని ఈ భీభత్స దృశ్యాన్ని చూస్తున్న శాంకో పాంజా గొర్రెల కాపరులు పారిపోగానే తన యజమాని వద్దకు పరిగెత్తుకుంటూ వచ్చాడు. అతడు అమితంగా బాధపడటం చూసాడు. తన యజమానుడి దుస్థితికి ఎంతో విచారించాడు.

"మహాప్రభూ! మహావీరుల యుద్ధరీతికీ, సామాన్యుల దెబ్బలాటకూ చాలా వ్యత్యాసముంటుందని లోగడ మీకు ఎన్నోసార్లు మనవి చేసాను. ఇప్పుడు కూడా ఆ గొర్రెలకాపరులమీదికి వెళ్ళవద్దని కూడా హెచ్చరించాను. అయినా మీరు నా మాటలను తృణీకరించారు. చూసారా! దాని పర్యవసానం ఎలా ఉందో!" అన్నాడు శాంకోపాంజా.

"నాకు తెలియని విషయమంటూ లేదు శాంకో! నీ చేత చెప్పించుకునే దుర్గతి నాకేం పట్టలేదు. మొదట చూసినప్పుడు వాళ్ళంతా రాక్షసులే. అయితే నా శత్రువు ఫ్రెస్టన్ వాళ్ళను గొర్రెలుగా మార్చివేసాడు. వాడు నా విజయాన్ని చూసి సహించలేడు. అయినా ఏనాటికయినా అంతిమ విజయం నాదే!" అన్నాడు క్విక్సోట్.

అప్పటికి చీకటి పడబోతున్నది. ఆ రాత్రి అక్కడే విశ్రాంతి తీసుకుందామని నిశ్చయించుకున్నారు. వెంట తెచ్చుకున్నది యింత తిని, నేలమీద గురకపెట్టి నిద్రపోయారు.

అర్ధరాత్రి సమయంలో కొందరు దొంగలు అటుగా వచ్చారు. ఎన్నిచోట్ల వెదికినా ఒక్క వస్తువుకూడా ఆ దొంగల చేతికి చిక్కలేదు. చివరకు వాళ్ళ కళ్ళకు చెట్టుకు కట్టేసివున్న బక్కగుర్రం. బలిష్ఠంగావున్న కంచరగాడిద కనిపించాయి. వాళ్ళు రోజినాంటి గుర్రాన్ని గాకుండా కంచరగాడిదను విప్పి గుట్టుచప్పుడు గాకుండా తమ వెంట తోలుకుపోయారు.

శాంకోపాంజా తెల్లవారిన తర్వాత లేచి తన వాహనం వంక చూసుకున్నాడు. కానీ కంచరగాడిద అక్కడ ఉంటే కదా! పాపం! శాంకోపాంజా దిక్కుతోచక నలుదిక్కులకూ వెళ్ళి చూసాడు. అయినా అతడి గాడిద మాత్రం కనిపించలేదు.

చేసేదేముంది!— శాంకోపాంజా కూడా రోజినాంటిని అధిరోహించక తప్పలేదు. డాన్ క్విక్సోట్‌నూ అతడి ఇనుప కవచాన్ని మోయడమే కష్టంగావున్న బక్క గుర్రానికి శాంకోపాంజా అదనపు భారాన్ని మోయడం చాలా కష్టమై పోయింది.

క్విక్సోటుకు పదే పదే అతడి హృదయరాణి అయిన డల్సీనియా గుర్తుకు రాసాగింది.

'డల్సీనియా రాకుమారి ఎలా వుందో! ఆమె క్షేమ సమాచారాలు తెలియ నిదే తనకు మనశ్శాంతి ఉండదు. మనశ్శాంతిలేని వీరుడు విజయ పరంపరలు ఎలా సాధించగలడు?' అనుకున్నాడు క్విక్సోటు.

వెంటనే శాంకోతో "చూడు నా ప్రియమైన సేవకా! నీకొక బరువైన కార్య భారాన్ని అప్పగిస్తున్నాను. దానిని నువ్వు తప్ప ఇతరులెవ్వరూ సాధించలేరు" అన్నాడు.

"చెప్పండి ప్రభూ! మీరు అప్పగించే కార్యాన్ని దైవకార్యంగా భావించి నెరవేర్చుకుని వస్తాను" అన్నాడు శాంకో.

"చూడు శాంకో! నీకు మహారాణి, నా హృదయరాణి అయిన డల్సీనియా రాకుమారి పదే పదే గుర్తుకు వస్తున్నది. నేను ఆమెకొక లేఖ రాసి యిస్తాను. నువ్వు ఆ లేఖను రాకుమారికి అందజేయాలి. అంతేకాదు ఆమె వద్దనుండి యోగక్షేమాలతో కూడిన సమాచారాన్ని తీసుకు రావాలి" అన్నాడు డాన్ కిక్సోటు.

"చిత్తం! ప్రభువుల ఆజ్ఞ శిరోధార్యం నాకు. లేఖను సిద్ధం చేయండి" అన్నాడు శాంకో.

క్విక్సోటు రాకుమారికి ఉత్తరం రాసాడు. దానిని శాంకోకు వినిపించాడు. లేఖ అద్భుతంగా ఉందని మెచ్చుకున్నాడు శాంకో!.... అతడు ఆ ఉత్తరాన్ని తీసుకుని టొబోసో దిక్కుగా ప్రయాణం సాగించాడు. మరునాటి కతడు పూర్వం ఒకసారి తనను అవమానించిన పూటకూళ్ళ ఇంటికి చేరుకున్నాడు. అదే సమ యంలో ఇద్దరు వ్యక్తులు లోనుండి యివతలికి వచ్చారు. వారు డాన్ క్విక్సోటు స్నేహితులైన మతాధికారి, మంగలి!— వాళ్ళు శాంకోపాంజాను స్నేహ పూర్వ కంగా పలుకరించారు. శాంకో వాళ్ళతో తమ వృత్తాంతం యావత్తూ తెలియజేసాడు.

క్విక్సోట్‌ను ఇంటికి తీసుకుపోవడం ఎలాగ? అని ఇద్దరు స్నేహితులు బాగా ఆలోచించారు. మతాధికారి ఓ యువతి వేషం, మంగలి సేవకుడి వేషం ధరించి శాంకోతో కలిసి క్విక్సోట్ కూర్చున్న చోటికి వచ్చారు.

"ఎవరు మీరు?" అని అడిగాడు క్విక్సోట్.

"యోధాగ్రేసరా! నీకొక ముఖ్యమైన విషయం తెలియజేయటానికి కష్టనష్టాల కోర్చి యిక్కడికి చేరుకున్నాము. అదేమంటే— నీ హృదయరాణి అయిన డల్సినియా రాకుమారిని ఒక దుర్మార్గుడు పట్టి క్రూరంగా బాధపెడుతున్నాడు. నీవు వచ్చి ఆమెను రక్షించుకోవలసిన సమయం ఆసన్నమైంది" అని చెప్పాడు యువతి వేషంలో ఉన్న మతాధికారి.

"అవును! నిజమే!" అన్నాడు శాంకో విచారవదనంతో.

క్విక్సోట్ దిగ్గున లేచాడు. ఆయుధాలు ధరించాడు. టొబోసో వెళ్ళి రాకుమారిని రక్షించుకోవాలని నిశ్చయించుకున్నాడు.

ఆ నలుగురూ ప్రయాణం చేసి, తిరిగి పూటకూళ్ళ ఇంటికి చేరుకున్నారు. అక్కడ క్విక్సోటును అన్ని సౌకర్యాలు ఏర్పాటు చేయబడ్డాయి. సుష్టుగా భోజనం చేసిన క్విక్సోటు హాయిగా నిద్రపోయాడు.

ఈ లోపల క్విక్సోట్ స్నేహితులు అతడ్ని ఇంటికి ఎలా తీసుకువెళ్ళాలా! అని దీర్ఘంగా ఆలోచించారు. అందుకు తగిన ఏర్పాట్లు అన్నీ చేసారు.

పూటకూళ్ళ ఇంటిలో పని చేస్తున్న సేవకులు మారువేషాలు వేసుకుని వచ్చి నిద్రపోతున్న క్విక్సోట్ కాళ్లూ, చేతులూ త్రాళ్ళతో గట్టిగా బంధించారు.

క్విక్సోటు నిద్ర మేల్కొని చుట్టూ చూసాడు. అతడికి కొత్త ముఖాలు కనిపించాయి. వాళ్ళు మాంత్రికుడి గురించి మాట్లాడుకోసాగేరు.

'అయితే ఇదంతా నా శత్రువైన మాంత్రికుడి పన్నాగమన్నమాట! వాడి అనుచరులను పంపి నిద్రిస్తున్న నన్ను మాయోపాయంతో బంధించాడు. నేను ఎలాగైనా తప్పించుకుని ముందుగా మాంత్రికుణ్ని నాశనం చేయాలి!' అనుకున్నాడు క్విక్సోటు.

ఆ తర్వాత వాళ్ళు క్విక్సోటును పెద్ద బోనులో ఉంచారు. ఆ బోనును అతికష్టం మీద ఓ ఎద్దుల బండి మీదికి ఎక్కించారు.

ఆరు రోజులు ఏకధాటిగా ప్రయాణం చేసి చివరకు మతాధికారి, మంగలి, శాంకోపాంజా ఎద్దుల బండితో సహా, తమ గ్రామ పొలిమేరలకు చేరుకున్నారు.

## 6

డాన్ క్విక్సోటు కొంతకాలం ఇంటివద్ద బుద్ధిమంతుడిలా విశ్రాంతి తీసుకున్నాడు. అతడికి పూర్తి ఆరోగ్యం చిక్కింది. తిరిగి అతడి మనసు సాహస కృత్యాలవేపు పరుగులు పెట్టసాగింది. డల్సీనియా రాకుమారి అతడికి పదేపదేగుర్తుకు రాసాగింది.

శాంకోపాంజా మామూలు ప్రకారం కూలి పనులకు పోతున్నాడు. అయినా అతడికి క్విక్సోట్‌తో గడిపిన రోజులు గుర్తుకు వస్తూనే ఉన్నాయి.

'ఎన్నాళ్ళు యిలా కూలీనాలీ చేసుకుని జీవించడం! ఎదుగూ బొదుగూ లేని జీవితం!.... ఆ మహావీరుడ్ని నమ్ముకుని ఉంటే ఏనాటికైనా గవర్నర్‌ని కాకుండా పోతానా?.... అయితే ఏం లాభం? నాకు ప్రాప్తం లేదు.' అనుకునేవాడు శాంకో.

ఒకనాటి అర్ధరాత్రి క్విక్సోట్ శాంకోపాంజాను కలుసుకుని "నేను తిరిగి సాహస యాత్రలకు బయలుదేరాను. ఈసారి చాలా పట్టుదలతో ఉన్నాను. రాజ్యాలు జయించడం ఖాయం!.... నిన్ను ఒక దీవికి గవర్నర్‌ని చేయడం ఖాయం! నాతో వస్తావా?" అని అడిగాడు.

అప్పటికే కూలి డబ్బులతో ఓ కంచర గాడిదను కొనుక్కున్నాడు శాంకోపాంజా!

"నా వాహనం, నేనూ మీ సేవలో సిద్ధమే! బయలుదేరండి!" అన్నాడు శాంకో.

వారం రోజులు ప్రయాణం చేసిన తర్వాత ఇద్దరూ టొబోసో గ్రామం చేరుకున్నారు.

"నా ప్రియమైన శాంకో! నువ్వు నా హృదయరాణి డల్సీనియా రాకుమారి రాజభవనాన్ని చూసావు కదా! నన్ను అక్కడికి తీసుకుపద!" అన్నాడు శాంకోతో క్విక్సోట్.

"ప్రభూ! డల్సీనియా రాకుమారి ప్రస్తుతం రాజభవనంలో నివసించడం లేదు. ఆమె ఇప్పుడు ఓ పూరి గుడిశెలో ఉంటున్నది" అన్నాడు శాంకో.

"నువ్వు చాలా కాలం క్రిందట ఆమెను చూసి ఉంటావు. ఇప్పుడామె ఎక్కడ ఉంటున్నదో నాకు తెలుసు. పద వెళ్దాం!" అంటూ క్విక్సోట్, శాంకోను తీసుకుని ఓ పెద్ద చర్చివద్దకు చేరుకున్నాడు.

"చూసావా శాంకో! ఇదే డల్సీనియా రాకుమారి నివసించే విశాల రాజ భవనం!" అన్నాడు క్విక్సోటు శాంకోతో.



క్విక్సోట్ ముప్పురు సామాన్య యువతుల ముందు మోకరిల్లటం

అప్పటికి బాగా చీకటి పడింది. క్విక్సోటు, శాంకో ఇద్దరూ కలిసి చర్చి లోపలికి వెళ్ళారు. గదులన్నీ గాలించారు. అయితే క్విక్సోట్‌కు డల్సీనియా రాకు మారి కనిపించలేదు. ఆ రాత్రంతా అతడు రాకుమారి కోసం చర్చి యావత్తూ వెదుకుతూనే ఉన్నాడు.

అంతలో తెల్లవారింది. ఇద్దరూ తాళ్ళోద్చుకుంటూ వాహనాలను నడిపించుకుంటూ ఊరి చివర ఉన్న తోటలోకి వచ్చారు.

అక్కడ ఓ చెట్టునీడన విశ్రమించిన క్విక్సోటు, శాంకోతో "శాంక్! రాత్రంతా రాకుమారిని వెదికి వెదికి బాగా అలసిపోయాను. కనుక నువ్వు వెళ్ళి రాకుమారి ఆచూకీ తెలుసుకుని రా! ఇది నా ఆజ్ఞ!" అన్నాడు.

"చిత్తం! అలాగే ప్రభూ!" అన్నాడు శాంకో.

తక్షణం అతడు తన కంచర గాడిదను అధిరోహించాడు. దానిని తోలుకుంటూ టొబోసో గ్రామ సమీపానికి వెళ్ళాడు. అక్కడ తన వాహనాన్ని దిగి, దానిని ఓ చెట్టుకు కట్టేసి చెట్టు కింద చల్లని నీడలో విశ్రమించాడు.

ఆ తర్వాత తలెత్తి ఓ యువతిని చూస్తూ "ఓ నా రాజకుమారీ అందాల నా హృదయరాణి! నీవు జగదేక సుందరివి! ఈ దీనుణ్ని కరుణించు! నీ రూప లావణ్యాలను ఫ్రెస్టన్ అనే మాంత్రికాధములు మార్చి వేసాడని నాకు తెలుసు. నేను ఆ దుర్మార్గుణ్ని వధించి, తిరిగి నీకు పూర్వపు రూపాన్ని వచ్చేటట్టు చేస్తాను. నీవు ఏమాత్రం భయపడవద్దు" అన్నాడు.

ఆ యువతి డాన్ క్విక్సోట్ మాటలకు చిరాకుపడుతూ "ఎవరు నువ్వు? ఏమిటీ పిచ్చి పేలాపన? ఛో....దూరంగా తొలగిపో!.... నా దారి నుండి అడ్డు తొలుగు!" అంటూ తన కంచర గాడిదను తోలుకుంటూ ముందుకు సాగిపోయింది.

క్విక్సోట్ విచార వదనంతో శాంకోను చూస్తూ "చూశావా శాంకో! రాకుమారి నన్నెంత తృణీకారభావంతో మాట్లాడి వెళ్ళిపోయిందో! ఇదంతా ఆమె పొరబాటుకాదు. ఆ ఫ్రెస్టన్ మాంత్రికుడి దుశ్చర్య!.... చూస్తాను ఈ విషయంలో ఆ నీచుడు ఎలా విజయం సాధిస్తాడో!....అంతిమ విజయం నాదే!" అన్నాడు.

ఆ తర్వాత ఇద్దరూ ప్రయాణం సాగించారు. మార్గమధ్యంలో వారికొక బండి తారసపడింది. బండిలో రకరకాల వేషధారులు కూర్చుని ఉన్నారు. క్విక్సోట్ వారిని చూసి ఎంతో ఆశ్చర్యపోయాడు.

బండి తోలుతున్న వాడి దగ్గరకు వెళ్ళి "బండిలో ఉన్నవారు ఎవరు?" అని ప్రశ్నించాడు.

"బండిలో ఉన్నవారంతా ఆటగాళ్ళు. వాళ్ళు రకరకాల వేషాలు వేసుకుని ప్రేక్షకులను సంతోష పెడతారు. ఈనాటి రాత్రి సమీప పట్టణంలో మేమొక నాట

నాన్ని ప్రదర్శింపబోతున్నాం. ఆ నాటకం చాలా రసరమ్యంగా ఉంటుంది" అన్నాడు బండి తోలేవాడు.

క్విక్సోట్ బండి తోలేవాడి వినయ విధేయతలకు ఎంతో సంతోషించాడు. బండిలోని వారితో మర్యాదగా మాట్లాడసాగేడు. అదే సమయంలో వాళ్ళలోని హాస్యగాడు ఒకడు, రోజినాంటిని చూసాడు. ఆ బక్క గుర్రం అతడికి నవ్వు పుట్టించింది. దానిని ఆట పట్టించాలన్న కోరిక కలిగించింది హాస్యగాడికి! .... అతడు రోజినాంటి వద్దకొచ్చి పెద్దగా గంటలువాయిస్తూ గట్టిగా అరుస్తూ నాట్యంచేయడం ప్రారంభించాడు. దాని చెవి దగ్గర కొమ్ము బూరా పెట్టి గట్టిగా ఊదాడు. వాడి అరుపులకు చేస్తున్న చప్పుళ్ళకు బెదిరిపోయిన గుర్రం వేగంగా ముందుకు పరిగెత్తుకుంటూ పోయింది. క్విక్సోట్ దిక్కుతోచక పారిపోతున్న రోజినాంటిని చూస్తూ ఉండిపోయాడు.

అప్పుడు శాంకోపాంజా గాడిద మీదినుండి క్రిందికి దూకి పరిగెత్తుకుంటూ వెళ్ళి బక్క గుర్రాన్ని ఆపుజేసాడు. ఈ లోపల హాస్యగాడు పెద్ద దుడ్డుకర్ర తీసుకుని. శాంకోపాంజా వాహనమైన గాడిద వెనుక కాళ్ళమీద గట్టిగా కొట్టాడు. ఆ దెబ్బతో అది బాధతో ఓండ్రపెడుతూ ఎటో పారిపోయింది.

ఈ సందడిలో బండివాడు బండిని తోలుకుంటూ ముందుకి సాగిపోయాడు.

"మనలను ఇంత ఏడిపించిన, వాళ్ళను కఠినంగా శిక్షిస్తాను" అన్నాడు క్విక్సోటు.

"వద్దు ప్రభూ! వాళ్ళు సామాన్యమైన కళాకారులు! .... పిచ్చుకలమీదనా మీ ప్రతాపం! .... నా గాడిద ఎలాగూ దొరుకుతుంది. శాంతించండి!" అన్నాడు శాంకో.

ఆ తర్వాత అతడు అక్కడా యిక్కడా వెదికి తన గాడిదను తెచ్చుకున్నాడు.

తిరిగి ఇద్దరూ ప్రయాణం సాగించారు. సాయం సమయానికి వాళ్ళు ఓ మైదాన ప్రాంతానికి చేరుకున్నారు. అక్కడ వాళ్ళు ఓ చెట్టు నీడన విశ్రమించారు.

అదే సమయంలో ఇద్దరు వ్యక్తులు గుర్రాలను అధిరోహించి అటుగా వచ్చారు.

"ఎవరు మీరు?" అని అడిగాడు క్విక్సోట్ వాళ్ళను.

"నేను మహాయోధుడను! ఇతడు నా సేవకుడు" అని చెప్పాడు.

"నువ్వు మహాయోధుడివా!" అంటూ ఈర్ష్యతో అడిగాడు క్విక్సోట్.



13. హాస్యగాడి తమాషా

"నేను మహాయోధుడనే కాదు; వీరాధివీరుడను కూడా! నేను ఎందరో మహాయోధులను జయించాను. నన్ను మించిన యోధుడు ఈ ప్రాంతంలోనే లేడు" అన్నాడు నూతన యోధుడు.

క్విక్సోట్ ఆగ్రహంతో "నువ్వు నన్ను మించిన మొనగాడివా?" అన్నాడు.

"హుఁ!.... నువ్వు మహాయోధుడు డాన్‌క్విక్సోట్‌కన్నా గొప్ప యోధుడివా ఏమిటి? అటువంటి డాన్‌క్విక్సోట్‌నే ద్వంద్వయుద్ధంలో ఓడించిన వీరాధివీరుడను తెలుసా?" అన్నాడు నూతన యోధుడు.



14. డాన్‌క్విక్సోట్ అద్దాల యోధునితో పోరుట.

క్విక్సోట్ కళ్ళెర్రజేస్తూ "నువ్వు చెబుతున్న డాన్‌క్విక్సోట్‌ను నేనే! నన్ను నువ్వు ఎప్పుడు ఓడించావు?" అన్నాడు.

నూతన యోధుడు నవ్వి "ఇప్పుడు ఓడిస్తాను. నీ ఖడ్గాన్ని తియ్!" అన్నాడు.

అప్పటికి బాగా చీకటి పడింది!

"చీకటిలో యుద్ధమేమిటి? రేపు ఉదయాన్నే ప్రారంభించుదాము" అన్నాడు క్విక్సోట్.

దానికి నూతన యోధుడు అంగీకరించాడు. ఆ రాత్రి నలుగురూ కూర్చుని భోజనం చేసారు. సరదాగా పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ మత్తుపానీయం సేవించారు. ఆ తర్వాత హాయిగా పడుకుని, నిద్రపోయారు.

తెల్లవారగానే, నలుగురూ లేచారు. యోధులు ఇద్దరూ బల్లేలు చేత ధరించారు. సేవకులు ఇద్దరూ దూరంగా నిలుచున్నారు. నూతన యోధుడి ముఖం మీద శిరస్త్రాణం అలాగే ఉంది. అతడు ధరించిన కవచానికి చిన్న చిన్న అద్దాలు అందంగా అమర్చబడి ఉన్నాయి.

అద్దాల యోధుడికీ, క్విక్సోట్‌కూ ద్వంద్వయుద్ధం ప్రారంభమైంది. కొద్ది క్షణాలు గడిచిన తర్వాత డాన్‌క్విక్సోట్ తన చేతిలోని బల్లెంతో అద్దాల యోధుడి మోకాళ్ళ మీద బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు అద్దాల యోధుడు నిలదొక్కుకోలేక వెల్లకిలా నేల మీద పడిపోయాడు.

ఆ యోధుడు ఎవరో చూడాలన్న కుతూహలం కలిగింది క్విక్సోట్‌కి! వెంటనే బల్లెం మొనను అతడి శిరస్త్రాణానికి గుచ్చి, దానిని పైకి లాగాడు. ఆ అద్దాల యోధుడి ముఖం చూస్తూనే క్విక్సోట్ ఎంతో ఆశ్చర్యపోయాడు.

ఎందుకంటే—ఆ అద్దాల యోధుడు డాన్‌క్విక్సోటు గ్రామానికి చెందినవాడే! అంతేకాదు; ఇద్దరూ స్నేహితులు కూడాను!....అతని పేరు 'శామ్సన్ కరాస్కో'. అతడు శాంకోపాంజాకు గూడ బాగా తెలుసు.

"ప్రభూ! ఈ శామ్సన్ కరాస్కో యోధుడేమిటి? నమ్మశక్యం గాకుండా ఉంది. ఇదంతా మీ బద్ధశత్రువైన మాంత్రికుడి పన్నుగడ! మీరు జాలి చూపించవద్దు. ఈ శామ్సన్ కరాస్కోను పొడిచి చంపేయండి!" అన్నాడు శాంకోపాంజా భయపడుతూ.

కొంతసేపటికి అద్దాల యోధుడు లేచి నిలుచున్నాడు!

"ఓ నా మిత్రుడా! డాన్‌క్విక్సోటు! నువ్వు నా కంటె గొప్ప వీరుడవు. ఈ విషయాన్ని నేను ప్రపంచమంతా చాటుతాను" అన్నాడు.

క్విక్సోటు ఎంతో సంతోషించి అతడ్ని స్వేచ్ఛగా విడిచిపెట్టాడు.

అద్దాల యోధుడు తన సేవకుడితో తిరిగి ప్రయాణం సాగించాడు.

కొంతదూరం వెళ్ళిన తర్వాత "నేను ఏనాటికైనా సరే, డాన్‌క్విక్సోటు మీద పగ తీర్చుకుంటాను. అతడిని ద్వంద్వయుద్ధంలో తప్పక ఓడించి విజయం సాధిస్తాను. ఇది నా ప్రతిజ్ఞ!" అన్నాడు అద్దాల యోధుడు తన సేవకుడితో.

డాన్‌క్విక్సోటు, శాంకోపాంజా తిరిగి ప్రయాణం సాగించారు. అలా పోగా, పోగా మార్గంలో వారికొక పెద్ద బండి కనిపించింది. ఆ బండిమీద పెద్ద బోను ఉంది. ఆ బోను బలమైన చెక్కలతో తయారు చేయబడింది. అందులో ఏముందో బయటికి కనిపించడంలేదు. దానికొక తలుపు ఉంది.

క్విక్సోట్ బండివాడిని ఆపి "నీ బండిమీద ఉన్న ఆ భోషాణం ఏమిటి? అందులో ఏమి ఉంది?" అని అడిగాడు.

"ఇందులో భయంకరమైన సింహం ఉంది. ఈ సింహాన్ని గవర్నర్‌గారు ఒకరు. మన మహారాజుగారికి బహుమానంగా? యిచ్చారు. కనుక దీనిని రాజధానికి తీసుకుపోతున్నాను." అన్నాడు బండివాడు.

"ఓహో! అలాగా! నేను మనుషులతో పోరాడాను కానీ క్రూరమృగాలతో పోరాడలేదు. నేను యిప్పుడు ఈ సింహంతో యుద్ధం చేస్తాను. దానిని బయటికి విడిచిపెట్టు!" అన్నాడు క్విక్సోట్ ఆవేశంగా.

బండివాడు నవ్వి "నువ్వు భయంకరమైన సింహంతో పోట్లాడుతావా? నాలుగు కాలాలపాటు నీకు బ్రతకాలనే ఆశ లేదా!.... అసలే ఇది ఆకలితో ఉంది. ఎదురుగా నిన్ను చూసీ చూడగానే అమాంతం నీ మీదికి దూకుతుంది. రొట్టెముక్క నమిలినట్టు చప్పరించి పారేస్తుంది! తెలుసా?" అన్నాడు.

క్విక్సోటు అతడి మాటలు వినిపించుకోలేదు. సింహాన్ని బయటికి తీయవలసిందే నంటూ పట్టుబట్టాడు.

"ఇది మహారాజు గారికి బహుమానంగా పంపిన సింహం. దీనిని తీసుకు వెళ్ళకపోతే మహారాజుగారు నా ప్రాణాలు తీస్తారు" అన్నాడు బండివాడు ఏడుపు ముఖం పెట్టి.

డాన్ క్విక్సోట్ చర్రున ఒర నుండి ఖడ్గంలాగి "మహారాజు గారు నీ ప్రాణాలు తీస్తారో లేదో నాకు తెలియదు కానీ నువ్వు బోను తలుపు తక్షణం తీయకపోయావో ఈ క్షణంలోనే నీ ప్రాణాలు ఎగిరిపోతాయి." అన్నాడు.

బండివాడు దిక్కుతోచక అటు యిటు చూడసాగేడు.

శాంకో పాంజా కలుగజేసుకుని "వీరాధివీరా! వీరాగ్రేసరా!.... ఇంత మొండి పట్టు మీకు తగదు. జంతువులూ, జంతువులూ పోట్లాడుకోవడం ధర్మం కానీ, మనుషులు, జంతువులతో పోట్లాడడం అనుచితం, అధర్మం!...." అన్నాడు.



డాన్‌క్విక్సోట్ సింహంతో పోరటానికి సిద్ధపడటం

అయినా క్విక్సోటు అతడి మాటలను కూడ పెడచెవిన పెట్టాడు. బండివాడు 'ఏదైతే అదే అవుతుంది! ఈ మూర్ఖుడి చేతిలో ప్రాణాలు పోగొట్టుకోవడం దేనికి?' అనుకున్నాడు.

తక్షణం బండికి కట్టిన కంచర గాడిదలను విప్పి దూరంగా తీసుకుపోయాడు. ఆ తర్వాత వెనుదిరిగి వచ్చి బోను తలుపు తెరిచాడు. అంతకు మునుపే

శాంకోపాంజా ఏ పెద్దచెట్టు ఎక్కేసాడు.

'సింహం తన యజమానిని చంపడం ఖాయం! తను తిరిగి గ్రామం చేరు కోవడం ఖాయం. గవర్నర్ పదవి పోయినట్టే! ఇక కూలిపని చేయడం తప్ప మరొక మార్గం లేదు' అనుకున్నాడు శాంకో.

క్విక్సోట్ కత్తిచేత ధరించి బోనుకు ఎదురుగా నిలుచున్నాడు.

బోనులో ఉన్న సింహం బద్ధకంగా వొళ్ళు విరుచుకుంది. ఎదురుగా నిలు చున్న వ్యక్తిని పరీక్షగా చూసింది. బోనులో అటు యిటు రెండు మూడుసార్లు పచార్లు చేసింది. మళ్ళీ డాన్‌క్విక్సోట్ వేపు పరీక్షగా చూసింది.

నెత్తిమీద విరిగిపోయిన శిరస్త్రాణం శరీరం మీదున్న తుప్పుపట్టిన కవచం చేతిలోని నల్లటి ఖడ్గం అతడి అపూర్వ ఆకారం. పాపం సింహానికి నచ్చలేదు కాబోలు ముందుకు వస్తున్నదల్లా ఆగిపోయింది. ఆ తర్వాత వెనుదిరిగి బోను లోపలికి వెళ్ళి, నాలుగు కాళ్లూ బార్లా చాపి హాయిగా పడుకుంది.

అది చూసిన క్విక్సోటుకు ఆశాభంగం కలిగింది. సింహం బయటికివస్తే కదా దానిని యోధుడు జయించడమో, లేక అది మన యోధుణ్ని కబళించడమో జరిగేది!—

సింహాన్ని బయటికి ఎలా రప్పించాలో తెలియని క్విక్సోట్ బోను మీద నిలబడి ఉన్న బండివాడితో "నువ్వు బోనులోకి వెళ్ళి సింహంతోక పుచ్చుకుని బయటికి ఈడ్చుకురా!" అన్నాడు.

బండివాడికి ఏం చెప్పాలో తోచక "అయ్యా! వీరాగ్రేసరా! సింహం మిమ్మల్ని చూసి భయపడిపోయింది. యుద్ధానికి వచ్చినా మిమ్మల్ని జయించలేనని నిర్ధారణ చేసుకుంది. అందుకే బోనులోనుండి యివతలికి రాలేదు. కనుక మీరే విజయం సాధించారు. సింహం ఓడిపోయింది. ఈ విషయాన్ని నేను మహారాజు గారితో మనవి చేస్తాను" అన్నాడు ఎంతో వినయపూర్వకంగా.

"మనవి చెయ్! నా పౌరుష ప్రతాపాలను మహారాజుగారికి వివరించి చెప్పు! నేను లామాంషా గ్రామానికి చెందిన డాన్ క్విక్సోట్‌నని సవిస్తరంగా మనవి చెయ్! ఇకనుండి నేను 'సింహయోధుడు'గా ప్రసిద్ధికెక్కుతాను. అందరూ నన్ను ఆ పేరుతోనే పిలవాలి" అని డాన్ క్విక్సోట్ సగర్వంగా ప్రకటించుకున్నాడు.

బోనులోనుండి సింహం యివతలికివచ్చి తన యజమానుని దేనికి కబళించ లేదో శాంకోపాంజాకు ఎంత ఆలోచించినా అర్థంకాలేదు.

అతడు చెట్టుదిగివచ్చి "సింహవీరా! మీకివే నా జోహార్లు! మీకివే నా హృదయపూర్వక అభినందనలు" అంటూ పొగడ్తలలో ముంచెత్తాడు.

డాన్ క్విక్సోటు ఆనందానికి మేరలేకపోయింది.

## 7

డాన్ క్విక్సోట్, శాంకోపాంజాలు తిరిగి ప్రయాణం సాగించి, ఒకనాటి చీకటిపడే సమయానికి ఓ పూటకూళ్ళ ఇంటికి చేరుకున్నారు. ఆ రాత్రికి అక్కడ బస చేశారు. ఆ రాత్రి పూటకూళ్ళ ఇంటికి పీటర్ అనే వ్యక్తి వచ్చాడు. అతడివద్ద తోకలేని కోతి ఒకటి వుంది. ఆ కోతి మానవుల అదృష్ట, దురదృష్టాలను స్పష్టంగా చెప్పగలదు....అని పీటర్ అక్కడున్న వారితో చెప్పడం క్విక్సోట్ విన్నాడు.

అతడు కోతి దగ్గరకు వెళ్ళి "నా భవిష్యత్తు చెప్పు?" అని అడిగాడు.

"నా కోతి జరిగిపోయిన విషయాలనే చెబుతుంది. జరుగబోయే విషయాలను చెప్పదు" అన్నాడు పీటర్.

దానికి శాంకోపాంజా నవ్వుతూ "జరిగిపోయిన విషయాలను చెప్పడం గొప్ప విషయంకాదు. ఇప్పుడు నా భార్య మా ఇంటివద్ద ఏం చేస్తూ వుంటుందో నీ కోతిచేత చెప్పించు" అన్నాడు.

అప్పుడు పీటర్ కోతివంక చూశాడు. అది పీటర్ చెవివద్ద మూతిపెట్టి ఏదో మాట్లాడింది. తర్వాత దూరంగా వెళ్ళి కూర్చుంది.

పీటర్ మన యోధుడితో యిలా చెప్పాడు :

"మహానుభావా! నువ్వు మహాయోధాగ్రేసరుడివట. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ మీ ధ్యేయమట!.... 'అటువంటి డాన్ క్విక్సోటును వర్ణించడం ఎవరి తరం?' అని చెబుతున్నది నా కోతి" అన్నాడు పీటర్.

తర్వాత అతడు శాంకో దిక్కు తిరిగి "మీ భార్య గురించి ఏ మాత్రం విచారించవద్దు అంటున్నది. ఈ క్షణాన ఆమె ద్రాక్ష సారాయం సేవిస్తున్నదట. మీరు మీ యజమానికి తగిన విశ్వాసపాత్రులని నా కోతి చెబుతున్నది" అన్నాడు పీటర్.

సాధారణంగా పీటర్ వంటి వ్యక్తులు బహు ప్రజ్ఞావంతులుగా ఉంటారు. ఎవరు ఎవరో, వారి పుట్టుపూర్వోత్తరాలు ఏమిటో ముందే సేకరిస్తూ వుంటారు. ఆ

విషయాలు తెలియని మన యోధునివంటివారు కోతివద్ద ఏదో మహిమ వుందని భావిస్తూ ఉంటారు.

ఆ సంభాషణ పూర్తి అయిన తర్వాత పీటర్ పదిమంది ముందూ తోలు బొమ్మలాట ప్రారంభించాడు.



డాన్ క్విక్సోట్—పీటర్-కోతి

పీటర్ తోలుబొమ్మలను కదిలిస్తున్నాడు. పీటర్ వెంట వున్న బాలుడు కథను వివరించి చెప్పసాగేడు.

ఆ తోలుబొమ్మలాట కథలో ముష్కరజాతికి చెందినవారు. 'డాన్ గేఫెరోస్' అనే వ్యక్తినీ అతడి భార్య మెలిసెంద్రాను నానా బాధలు పెడుతూ ఉంటారు. బాలుడు చెబుతున్న కథలో ఆ దంపతుల బాధలు హృదయ విదారకంగా

డాన్ క్విక్సోట్ చెవులకు వినిపించాయి. మహాయోధుడు కనుక క్విక్సోట్ వాటిని విని సహించలేకపోయాడు. అతడికి అపరిమితమైన కోపం వచ్చింది. అక్కడ కదులుతున్నది తోలుబొమ్మలుగా కనిపించలేదు. వాళ్ళు నిజమైన మనుషులుగా క్విక్సోట్‌కు కనిపించారు.



డాన్ క్విక్సోట్ బొమ్మలను విరగ్గొట్టటం

ఇంకేముంది!—అతడు అమాంతం లేచి వెళ్ళి తోలుబొమ్మలమీద విరుచుకు పడ్డాడు. కొన్ని బొమ్మలను కాళ్ళతో తన్ని విరగ్గొట్టాడు. కొన్నిటిని చేతులతో పీకి అవతలికి గిరాటు వేశాడు.

'అవి తోలుబొమ్మలు మహాప్రభో!' అని పీటర్ ఎంత మొత్తుకున్నా సరే డాన్ క్విక్సోటు వినిపించుకోలేదు. ఆటస్థలాన్ని యావత్తూ నానా భీభత్సం చేసి

పారేశాడు.

ఆట చూస్తున్న ప్రేక్షకులు అతడ్ని వారించబోగా అతడి భీకరాకారం చూసి తలకొక దిక్కు పారిపోయారు.

అంతా జరిగిపోయిన తర్వాత క్విక్సోటు శాంతించి "దుష్కరపీడిత దంపతులను రక్షించాను. అందుకు నాకెంతో ఆనందంగా ఉంది" అన్నాడు.

"మీరు నన్ను సర్వనాశనం చేసారు. వీటిమీద బ్రతికే నాకు జీవనాధారం లేకుండా చేశారు. ఇప్పుడు నేను ఇంటింటికి వెళ్ళి భిక్షమెత్తుకుంటేగాని నా పొట్ట గడవదు" అంటూ పీటర్ శోకాలు మొదలుపెట్టాడు.

అప్పుడు శాంకో పీటర్ని ఓదార్చుతూ "నువ్వేమీ దిగులుపెట్టుకోకు! మా యజమానుడు దీనులను ఆదుకునే భూతదయాపరుడు. నీకెంత నష్టం జరిగిందో అంత సొమ్ము యిచ్చేస్తాడు" అన్నాడు.

పీటర్ డాన్ క్విక్సోటు ముఖంవంక దీనంగా చూశాడు.

"అవును!....ముమ్మాటికీ నేను దీనజన రక్షకుడనే! నా సేవకుడు చెప్పిన దానిలో అణుమాత్రం కూడా అసత్యంలేదు. దుష్టులను శిక్షించాలనుకున్నాను. శిక్షించాను!....నీకు జరిగిన నష్టం ఎంతో చెప్పు" అన్నాడు.

పీటర్ తన నష్టానికి పదింతలు హెచ్చుగా చెప్పాడు. ఆ డబ్బును పీటర్‌కు యివ్వవలసిందిగా తన సేవకుడికి ఆజ్ఞ జారీ చేశాడు క్విక్సోటు. శాంకో ఆ డబ్బు పీటర్‌కి యిచ్చేశాడు.

తెల్లవారిన తర్వాత పూటకూళ్ళ ఇంటినుండి వాళ్ళిద్దరూ తిరిగి ప్రయాణం సాగించారు.

ఆ విధంగా కొన్నిరోజులు ప్రయాణం చేసిన తర్వాత శాంకోపాంజా తన యజమానితో యిలా అన్నాడు :

"ప్రభూ! మన ప్రయాణం నిరంతరం సాగుతూనే వుంది. రోజులూ, వారాలూ, నెలలూ గడిచిపోతూనే వున్నాయి. మన లక్ష్యం ఏమిటో తెలియదు. మనం ఏమి సాధించాలనుకుంటున్నామో తెలియదు. దానివల్ల మీకు ఒనగూడే ప్రయోజనం ఏమిటో కూడా నాకు అర్థంగావడంలేదు. మనకు రుచికరమైన భోజనం లేదు. రుచికరమైన పానీయాలు లేవు. కటిక నేలమీదనే శయనిస్తున్నాము. హాయిగా ఇంటికిపోయి బ్రతుకు వెళ్ళబుచ్చడమే క్షేమమని నాకు తోస్తున్నది. దయచేసి నా జీతం లెక్కకట్టి యిచ్చేయండి. నేను ఇంటికి పోతాను" అన్నాడు శాంకోపాంజా.

అప్పుడు డాన్ క్విక్సోటు వేదాంతిలా నవ్వి "చూడు శాంకో! నీది వట్టి మట్టిబుర్ర సుమా! నువ్వు నిజంగా తెలివితేని గాడిదవు. నా లక్ష్యం వీరాధివీరుడ్ని కావడం!....అయ్యాను కదా!....అంతకుమించిన 'సింహయోధుడు' బిరుదాన్నికూడా పొందగలిగాను. నాకు ఇంకేం కావాలి?....అయితే నా ఈ శ్రమ యావత్తూ నీ కోసమే" అన్నాడు.

శాంకోపాంజా నోరు వెళ్ళబెట్టి "నా కోసమా ప్రభూ? అదెలా?" అని ఆశ్చర్యంగా అడిగాడు.

"అవును! నీ కోసమే నా కృషి యావత్తూ! యోధుడనేవాడు ఇచ్చిన మాట నిలబెట్టుకుంటాడు. నీ కోరిక నెరవేరుస్తానని వాగ్దానం చేసాను. నా మాట నిలబెట్టుకుంటాను. నిన్నొక పెద్ద దీవికి గవర్నర్‌ని చేస్తాను. అది త్వరలోనే జరుగుతుంది. నా మాట నమ్ము!" అన్నాడు క్విక్సోటు.

అది వింటూనే శాంకో ఉబ్బి తబ్బిబ్బయ్యాడు.

"మహాప్రభో! మీ లక్ష్యం ఏమిటో నాకు పూర్తిగా అర్థమైంది. ఇంతకు క్రితం అజ్ఞానంతో అన్నమాటలు పట్టించుకోకండి!.... ఈ సేవకుడు మీకు జీవితాంతం సేవలు చేస్తూనే ఉంటాడు. గవర్నర్ పదవి దక్కినా దక్కకున్నా సరే!" అన్నాడు వినయంగా.

డాన్‌క్విక్సోటు సేవకుడ్ని క్షమించాడు. తిరిగి ఇద్దరూ ప్రయాణం సాగించారు.

ఒకనాడు వాళ్ళిద్దరూ రాజమార్గం గుండా కబుర్లు చెప్పుకుంటూ తమ వాహనాలమీద నెమ్మదిగా వస్తున్నారు.

అదే సమయంలో వారికి కొద్ది దూరంలో కొంతమంది మనుషులు గుర్రాల మీద వస్తూ కనిపించారు. వాళ్ళ మధ్యగా ఓ అందమైన యువతి సర్వాలంకార భూషితయై రాచఠీవితో గుర్రం మీద వస్తున్నది. మిగిలినవారు రాజభటులు వాళ్ళ చేతులలో బల్లెలు ఉన్నాయి.

ఆ యువతిని చూస్తూనే డాన్‌క్విక్సోటు ఆనంద పారవశ్యంలో మునిగిపోయి "శాంకో! ఓయీ శాంకో పాంజా! అదుగో నా హృదయాధిదేవత! డల్సీనియా రాకుమారి! నన్ను ఆహ్వానించేందుకు మందీ మార్బలంతో వస్తున్నది. నువ్వు ఆ కంచరగాడిదను దిగి తక్షణం రాకుమారి వద్దకు వెళ్ళు! .... నేనెవరో నా మనో

వాంఛ ఏమిటో ఆమెకు వినిపించు వెళ్ళు! వెళ్ళు!" అంటూ తొందరపెట్టాడు.

శాంకో చప్పున వాహనాన్నిదిగి వాళ్ళముందుకు పరిగెత్తుకొంటూ వెళ్ళాడు ఆ యువతి ముందు మోకరిల్లాడు.

"ఎవరు నువ్వు? అంది ఆ యువతి.

"డల్సీనియా రాకుమారికి జయము! జయము! ఘనత వహించినరాకుమారీ" నేను ప్రపంచ ప్రసిద్ధిగాంచిన మహాయోధుడూ వీరాగ్రేసరుడు అయిన డాన్‌క్విక్సోటు ప్రభువుల సేవకుడను! అరుగో! వారు అక్కడ తమ అశ్వరాజం మీద ఉపవిష్టులై ఉన్నారు. వారి సందేశం తమతో మనవి చేయమన్నారు...."

"ఏమిటా సందేశం?" అంది ఆ యువతి.

"యోధాగ్రేసరుడైన డాన్‌క్విక్సోటు డల్సీనియా రాకుమారి సేవలు చేసేందుకు సిద్ధంగా ఉన్నాడు. అని మా యజమానుడు మీతో చెప్పమన్న సందేశం రాకుమారి!" అన్నాడు శాంకో.

వాస్తవానికి ఆమె ఓ ప్రభువు భార్య ప్రభువు కూడా ఆమె సరసనే ఉన్నాడు. శాంకో చెప్పిన మాటలు మహారాణికి కోపం తెప్పించాయి. ఆమె శాంకోతో ఏదో చెప్పబోయేంతలో మహారాజు ఆమెను వారించాడు. మహారాజూ మహారాణీ కొంతసేపు రహస్యంగా ముచ్చటించుకొన్నారు. మహారాజు డాన్‌క్విక్సోటు పేరును ఇంతకు క్రితమేవిని ఉన్నాడు.

ఎవరో గవర్నర్ సింహాన్ని బహుమానంగా పంపింది ఈ ప్రభువుకే!....

అప్పుడు మహారాణి శాంకోను లేవమని చెప్పి "నేను అటువంటి సింహ యోధుడ్ని కలుసుకోవాలని ఎంతో కుతూహలపడుతున్నానని మీ యజమానితో చెప్పు!" అంది.

శాంకోపాంజా వేగంగా వచ్చి మహారాణి సందేశాన్ని తన యజమానికి వినిపించాడు. అప్పుడు క్విక్సోట్ తన గుర్రం మీద వేగంగా వాళ్ళవద్దకు వచ్చాడు. అక్కడ ఆత్రుతగా గుర్రాన్ని దిగబోయి నేలమీద వెల్లకిలా పడిపోయాడు. అతడికి సహాయం చేయవలసిందిగా మహారాజు తన సేవకులను ఆజ్ఞాపించాడు. వాళ్ళు క్విక్సోట్‌ను లేవదీసి నిలుచుండబెట్టారు.



ప్రభు దంపతులతో క్విక్సోట్, శాంకోపాంజా

"యోధాగ్రేసరా! నిన్నూ, నీ సేవకుడినీ మా కోటకు ఆహ్వానిస్తున్నాను. మీరు తప్పకుండా మా ఆతిథ్యాన్ని స్వీకరించి మరీ వెళ్ళాలి. ఇది మా కోరిక!" అన్నాడు మహారాజు.

క్విక్సోట్ వాళ్ళ ఆహ్వానాన్ని సంతోషంగా అంగీకరించాడు. అందరూ కలిసి కోటకు చేరుకున్నారు. డాన్ క్విక్సోట్, శాంకో పాంజాలు రాజదంపతులతో కలిసి విందు భోజనాన్ని ఆరగించారు.

కొన్నాళ్ళపాటు ఆ ఇద్దర్నీ రాజభవనంలోనే ఉంచి వాళ్ళ మాటలూ, చేష్టలూ విని ఆనందించాలనీ, చూసి సంతోషించాలనీ ఓ విధంగా కాలక్షేపం చేయాలనీ రాజదంపతులు ఓ నిశ్చయానికి వచ్చారు.

భోజనాలు అయిన తర్వాత "యోధాగ్రేసరా! మీరు మా అతిథులు! అందునా 'సింహయోధ' బిరుదాంకితులు మిమ్మ సన్మానించడం మా కర్తవ్యంగా భావిస్తున్నాము. మీ మనసులో ఏదైనా కోరిక ఉంటే చెప్పండి. దానిని తప్పక తీరుస్తాము" అన్నాడు మహారాజు క్విక్సోట్‌తో.

అప్పుడు క్విక్సోట్ యిలా అన్నాడు: "ప్రభూ! నాకు కోరికలంటూ ఏమీ లేవు. కానీ, నా సేవకుడికి ఓ కోరిక ఉండిపోయింది. దానిని నెరవేరుస్తానని అతడికి వాగ్దానం చేసాను. నా మాట నిలబెట్టండి. నా కంతేచాలు!"

"అది ఎంతటి కష్టతరమైనా సరే నెరవేర్చగలనని వాగ్దానం చేస్తున్నాను. మీ సేవకుని కోరిక ఏమిటో చెప్పండి." అన్నాడు మహారాజు.

శాంకోపాంజాకు కావలసిన గవర్నర్ పదవి గురించి మహారాజుకు వివరించి చెప్పాడు డాన్ క్విక్సోట్.

"మా రాజ్యానికి చెందిన ఓ పెద్ద దీవికి శాంకోపాంజాను గవర్నర్‌గా ప్రకటిస్తున్నాము. అతడు రేపు ఉదయాన్నే సర్వ లాంఛనాలతో ఆ దీవికి ప్రయాణమై వెళతాడు!" అన్నాడు మహారాజు.

తన వాగ్దానాన్ని నిలబెట్టుకున్నందుకు డాన్ క్విక్సోటు ఎంతో సంతోషించాడు.

తను నిజంగానే ఓ పెద్దదీవికి గవర్నర్ కాబోతున్నందుకు శాంకోపాంజా ఎంతో ఆనందించాడు.

వాళ్ళను ఆ విధంగా ఆటపట్టించి తమ సరదా తీర్చుకుంటున్నందుకు రాజ దంపతులు కూడా ఆనందంలో మునిగిపోయారు.

## 8

తెల్లవారింది కోటయావత్తూ చాలా హడావిడిగా ఉంది. శాంకోపాంజాకు విలువైన దుస్తులు యివ్వబడ్డాయి. ఇతర లాంఛనాలు ధరించిన శాంకో గవర్నర్‌గా తయారయ్యాడు.

కొంతమంది రాజోద్యోగులను ఏర్పాటు చేసివారికి చెప్పవలసిన విషయాలు చెప్పి వారితోబాటు శాంకోపాంజాను మహారాజుగారు ఆ దీవికి పంపించారు. శాంకో మొట్టమొదటిసారిగా ఉత్తమాశ్వాన్ని అధిరోహించి గవర్నర్ పదవిని చేపట్టడానికి రాచఠీవితో బయలుదేరాడు. గవర్నర్‌గా ఏఏ విధులు నిర్వహించాలో తన క్రింది అధికారులనూ, అనుచరులనూ, సేవకులను ఏ విధంగా చూసుకోవాలో ఆ విషయాలను డాన్ క్విక్సోట్ తన సేవకుడికి వివరించి చెప్పాడు. ప్రభువుకు విధేయత చూపించాలని హెచ్చరించాడు.

కొన్నిరోజుల ప్రయాణం తర్వాత వారు 'బారటార్యా' దీవికి చేరుకున్నారు.

ఆ దీవిలోని అధికారులు తమ నూతన గవర్నరు అయిన శాంకోపాంజాకు

ఘనమైన స్వాగతం పలికారు. ముఖ్యమైన తాళం చెవులను అతడికి సమర్పించారు. అధికారులు శాంకోను చర్చికి తీసుకుపోయారు.

అక్కడ శాంకోపాంజాచేత గవర్నర్‌గా పదవీ ప్రమాణ స్వీకారం చేయించారు. తర్వాత కోటకు తీసుకువచ్చి గవర్నర్‌గా ఉన్నతాసనంమీద కూర్చుండబెట్టారు.

ఎట్టకేలకు శాంకోపాంజా 'బారటార్యా' దీవికి గవర్నర్ అయ్యాడు. అతడు గవర్నర్ పదవి చేపట్టిన మొదటిరోజునే న్యాయం కావాలంటూ కొంతమంది వచ్చారు.

"ఏమిటి మీరు చెప్పదలుచుకున్నది?" అని శాంకోపాంజా వాళ్ళను ప్రశ్నించాడు.

వాళ్ళల్లో ఒకడు పల్లెటూరివాడు. మరొకడు బట్టలుకుట్టే దర్జీవాడు.

"ఈ రైతు నాచేత కొన్ని టోపీలు కుట్టించుకున్నాడు ప్రభూ!.... అయితే కుట్టినకూలి మాత్రం యివ్వకుండా ఎగవేసాడు" అని దర్జీవాడు చెప్పాడు.

"నేను టోపీలు కుట్టకముందే కూలి డబ్బులు యిచ్చేసాను ప్రభూ! కుట్టిన తర్వాత మళ్ళీ కూలిడబ్బులు అడుగుతున్నాడు. న్యాయం మీరే నిర్ణయించండి" అన్నాడు రైతు.

శాంకోపాంజా కొంతసేపు ఆలోచించి "ఇది చాలా జటిలమైన సమస్య!.... దీనికి ఒక్కటే ఉపాయం వుంది. దర్జీవాడు కుట్టినకూలి నష్టపోవాలి. పల్లెటూరి రైతు టోపీలగుడ్డను నష్టపోవాలి. ఆ టోపీలను చెరసాలలోవున్న ఖైదీలకు అందజేయాలి" అంటూ తీర్పు చెప్పాడు.

తర్వాత ఇద్దరు ముసలివాళ్ళు ముందుకొచ్చారు.

"మీ తగువు ఏమిటి?" అని అడిగాడు శాంకో.

"ప్రభూ! నేను ఇతడికి వంద సువర్ణ నాణేలు అప్పుగా యిచ్చాను. బాకీ గురించి అడిగితే 'నీ బాకీ సొమ్ము యిచ్చేసాను. భగవంతుని సాక్షిగా నేను నీకేమీ బాకీలేను' అంటున్నాడు" అని ఓ వృద్ధుడు చెప్పాడు.



సరియైన తీర్పు చెప్పిన శాంకో పాంజా

రెండవవాడు, మొదటివాడికన్నా వృద్ధుడు కావడంవల్ల కర్రఊతగా చేసుకుని వచ్చాడు.

"నువ్వు ఇతడికి ఏమీ బాకీలేని విషయాన్ని భగవంతుని సాక్షిగా మరొక

సారి యీ సభలో చెప్పు?" అన్నాడు శాంకో.

రెండవ వృద్ధుడు అటు యిటు చూసి, తన చేతిలోని పొడవాటి కర్రను, మొదటి వృద్ధుడికి పట్టుకోమని యిచ్చాడు.

ఆ తర్వాత రెండు చేతులు జోడించి పైకి చూస్తూ "నేను ఇతడి బాకీని తీర్చేసాను. భగవంతుని సాక్షిగా నేను ఇతడికి ఒక్క రాగినాణెం కూడా బాకీలేనని ప్రమాణంచేసి చెప్పగలను" అన్నాడు.

శాంకోపాంజాకు ఎలా తీర్పు చెప్పాలో తెలియలేదు. అలా ప్రమాణం చేసిన మరుక్షణం రెండవ వృద్ధుడు మొదటి వృద్ధుడి చేతిలోని తన కర్రను తీసుకున్నాడు.

శాంకోపాంజా అది చూశాడు. అతడి బుర్రలో ఏదో ఆలోచన తళుక్కున మెరిసింది.

సభలోవున్న రాజభటులతో "ఆ ముసలివాడి వద్ద వున్న కర్రను తీసుకుని, దానిని మధ్యకు విరగ్గొట్టండి" అని ఆజ్ఞాపించాడు.

భటులు అలాగే చేసారు. వెంటనే విరిగిన కర్రలోనుండి వంద బంగారు నాణేలు గల్లుమంటూ నేలమీద పడ్డాయి. రెండవ వృద్ధుడు సిగ్గుతోనూ, అవమానంతోనూ తలవంచుకున్నాడు.

"ఆ సొమ్మును మొదటి వృద్ధుడికి యివ్వు. అంతేకాదు అపరాధ రుసుము క్రింద ఓ పాతిక సువర్ణనాణేలను కూడా చెల్లించు" అని తీర్పు చెప్పాడు శాంకో.

"ఓహో! మన నూతన గవర్నర్‌గారు 'కింగ్ సాల్మన్' అంతటి ప్రజ్ఞావంతులు" అని సభలోని వారంతా శాంకోను ఆకాశానికి ఎత్తేసారు.

ఆ మధ్యాహ్నం నూతన గవర్నర్ భోజనం బల్లవద్ద కూర్చున్నారు. బల్ల మీద ఎన్నో రుచికరమైన పదార్థాలు వున్నాయి. వాటి మధురమైన వాసనలు శాంకో పాంజాకు నోరూరించాయి.

శాంకో భోజనం చేయడానికి సిద్ధపడ్డాడు.

అంతలో ఓ అధికారి ముందుకొచ్చి "ఘనత వహించిన గవర్నర్ మహాశయా! ఒక్క క్షణం ఆగండి! రాజవైద్యులువచ్చి మిమ్మల్ని పరీక్ష చేస్తారు. పదార్థాలు తినదగ్గవో కావో నిర్ణయిస్తారు. అప్పుడు మీరు భుజింపతగ్గ పదార్థాలను సేవకులు వడ్డిస్తారు" అని చెప్పాడు.

"అలా ఎందుకు చేయడం?" అని శాంకో అడిగాడు.

"అలా చేయడం ముఖ్యం! మీ జీవితం మాకు అతి విలువైనది. మీకు ఎటువంటి ప్రమాదం జరుగకుండా రక్షించుకోవడం మా విధ్యుక్త ధర్మం!" అన్నాడు అధికారి.

శాంకో పొట్టలో ఎలుకలు పరిగెడుతున్నాయి. అయినా ఏం చేస్తాడు పాపం! తప్పదు కదా!

అరగంట గడిచిన తర్వాత రాజవైద్యుడు వచ్చాడు. ముందుగా శాంకోను పరీక్షించాడు. ఆ తర్వాత బల్లమీద ఉంచిన పదార్థాలను పరీక్షించాడు.

"గవర్నర్‌గారి శరీరంలో రుగ్మత ఉన్నట్టు కనిపిస్తున్నది. వారు ఈ పూటకి ఎండిన రొట్టె, బంగాళాదుంపల కూర తిని ఇన్ని మంచినీళ్ళు తాగాలి. మత్తు పానీయం పనికిరాదు." అని చెప్పి వైద్యుడు వెళ్ళిపోయాడు.

గవర్నర్‌గారికి సేవకులు అవే వడ్డించారు. మిగతా పదార్థాలను వంట గదిలోకి తీసుకుపోయారు.

శాంకోకు కళ్ళనీళ్ళ పర్యంతమైంది. 'తనకు రుగ్మత ఏమిటి?....' అనుకున్నాడు.

ఆ రోజుకు ఎండురొట్టెతోనే కాలక్షేపం చేసాడు. ఆ రోజేకాదు. రోజూ అదే తంతు!.... వైద్యుడి మీద శాంకోకు విపరీతమైన కోపం వచ్చేది. అయినా ఏం చేయగలడు?

ఆ విధంగా పక్షం రోజులు గడిచిపోయాయి!

'తనకు అధికారం ఉంది. చేతినిండా నౌకర్లూ, చాకర్లూ ఉన్నారు. తినేందుకు రుచికరమైన పదార్థాలు అనేకం ఉన్నాయి. అయినా తినడానికి అదృష్టం లేదు. వైద్యుడికి నా మీద ఏదో బద్ధవైరం ఉన్నట్టుంది. నన్ను ఏదీ తిననీయడం లేదు. దానికి అధికారులు వత్తాసు పలుకుతున్నారు. రాజవైద్యుడ్ని చంపిపారేస్తాను.' అనుకున్నాడు శాంకో.

తిండిలేక శాంకో బాగా చిక్కిపోయాడు!....

అదే సమయంలో ప్రభువు వద్దనుండి వార్తావహుడు వచ్చి ఓ లేఖను శాంకోకు యిచ్చాడు.

ఆ లేఖలో యిలా ఉంది! "గవర్నర్ మహాశయా! నిన్ను చంపడానికి కొంతమంది శత్రువులు ప్రయత్నిస్తున్నారు. వారు మీ మీద ప్రచ్ఛన్నంగా దాడి చేయవచ్చును. లేదా ఆహార పదార్థాలలో విషం కలిపి చంపవచ్చును. కనుక మీరు అప్రమత్తంగా ఉండటం మంచిది." అని!

శాంకో మనసు మనసులో లేదు. పనిఒత్తిడి ఎక్కువ కావడం వలనా భోజనం సరిగా చేయకపోవడం వలనా, మానసిక ఆందోళన వలనా అతడు బాగా నీరసించిపోయి లేవలేని స్థితికి వచ్చాడు. ఆ దీవిలోని కోటలో అతడి జీవితం దుర్భరంగా తయారైంది.

ఒకనాడు అధికారులు కొందరు శాంకోను కలుసుకుని "గవర్నర్ మహా శయా! శత్రువులు మన దీవిలో ప్రవేశించారు. మీరు తక్షణం ఆయుధాలు ధరించి మన సేవకు నాయకత్వం వహించండి! శత్రువులను చీల్చిచెండాడి మన దీవిని రక్షించండి" అన్నారు.

ఆ పరిస్థితిలో ఏం చేయాలో శాంకోకు తోచలేదు. మరుక్షణంలో కొంత మంది సైనికులు అక్కడికి వచ్చారు. వాళ్ళ చేతుల్లో ఓ ఖడ్గం, డాలూ, కవచం, బల్లెం ఉన్నాయి. వాళ్ళు శాంకోను నిలుచుండబెట్టి, శిరస్త్రాణం కవచం తొడిగారు. డాలూ, కత్తీ చేతికి యిచ్చారు.

యుద్ధ క్షేత్రంలో పెద్ద యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో శాంకోకు గాయాలు బాగా తగిలాయి. అతడు మూర్ఛపోయాడు.

కొంతసేపటికి శాంకోకు తెలివి వచ్చింది. కళ్ళు తెరిచి చుట్టూ చూసాడు. అక్కడ ఎవరూ లేరు. తనకు యిన్ని మంచినీళ్ళు యిచ్చేవారు కూడా లేకపోయారు.

'ఇదేమి గవర్నర్ పదవి! దీనికన్నా కలో గంజో తాగి పూరిగుడిశలో పడి ఉండడమే ఎన్నోరెట్లు మెరుగు. నాకి గవర్నరు పదవి అవసరం లేదు.' అనుకున్నాడు శాంకో.

అతి ప్రయాస మీద కోటకు చేరుకున్నాడు.

"మనం విజయం సాధించాం ప్రభూ!" అన్నారు అధికారులు.

"నాకు మీ విజయమూ వద్దు. గవర్నర్ పదవీ వద్దు. నా పదవికి రాజీనామా చేస్తున్నాను." అన్నాడు శాంకో.

వెంటనే విలువైన దుస్తులు విడిచి తన పాతబట్టలు ధరించాడు. తను ప్రభువు వద్దనుండి తెచ్చుకున్న అశ్వాన్ని అధిరోహించి తిన్నగా ప్రభువు వద్దకు

వచ్చాడు. డాన్ క్విక్సోటు అక్కడే ఉన్నాడు. అతడితో తను పడినకష్టాలను చెప్పుకుని, తనకి గవర్నర్ పదవి అవసరం లేదని మనవి చేసాడు.

ఆ తర్వాత ఇద్దరూ తిరిగి తమ తమ వాహనాలమీద ప్రయాణం సాగించారు.



డాన్ క్విక్సోట్ చంద్రయోధునితో పోరాడటం

వాళ్ళు ఆ విధంగా కొంతదూరం వెళ్ళిన తర్వాత ఒక యోధుడు శిరస్త్రాణం కవచం ధరించి ఉత్తమాశ్వం మీద వస్తూ వారి కంటబడ్డాడు.

"ఇదుగో డాన్ క్విక్సోట్! నువ్వు మహావీరుడవైతే నాతో యుద్ధం చేసి నన్ను జయించు చూద్దాం!" అన్నాడా యోధుడు.

డాన్ క్విక్సోటు యుద్ధానికి సిద్ధమయ్యాడు!

"నాదొక షరతు!...." అన్నాడా యోధుడు.

"ఏమిటది?"

"నేను జయిస్తే నువ్వు సాహసయాత్రలు విరమించుకుని తిరిగి నీ గ్రామం వెళ్ళి ప్రశాంత జీవనం గడపాలి. నువ్వు జయిస్తే జీవితాంతం నీకు సేవచేస్తూ గడుపుతాను." అన్నాడు యోధుడు.

డాన్ క్విక్సోట్ దానికి అంగీకరించాడు. ఇద్దరికీ ద్వంద్వ యుద్ధం ప్రారంభమైంది. కొంతసేపు గడిచిన తర్వాత క్విక్సోట్ నేలమీద పడిపోయాడు. అతడు ఓడినట్టు అంగీకరించాడు.

ఆ గెలిచిన యోధుడు ఎవరోకాదు. పూర్వం డాన్ క్విక్సోటు చేతిలో ఓడిపోయిన అద్దాల యోధుడే!

ఇచ్చిన మాట మేరకు డాన్ క్విక్సోట్ శాంకోను వెంటబెట్టుకుని తన గ్రామం చేరుకున్నాడు.

ఆ తర్వాత కొద్దిరోజులకే విషజ్వరం సోకి డాన్ క్విక్సోట్ మరణించాడు. అతడు తన వీలునామాలో ఆస్థిలో సగభాగం తన మేనకోడలికీ, సగభాగం శాంకో పాంజాకు చెందేటట్టు రాసాడు.

